# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
సంపాదించుటకేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు:

డాక్టరు కే. యన్. కేసరి

GRIHALAKSHMI

సంపుటము ౧౭] సెప్టెంబరు 1948 [సంచిక ౬






### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపీ ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైనను ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక



# గృహలక్ష్మి ఏజంట్లు:

గుంటూరు: వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాదరజా న్యూసు ఏజన్సి.
కాకినాడ: సి. హెచ్చి. కె. మూర్తి.
అనంతపురము: వై. సాంబయ్య.
వంగోలు: పి. యస్. నాయుడు.
భద్రాచలం. దొమ్మగూడెం గొరిదేవిపేట:
టి. వి. జి. ఆర్. మూర్తి
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
విజయనగరము: డి. సన్యాసయ్య.
పిఠాపురము: యం నూకరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
నంద్యాల: జి. నారాయణశెట్టి.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజిన్సీస్.
తుని: కోడూరు. నూకరాజు.
బరంపురం: కె. వి. రంగారావు.
గుత్తి: యల్. యస్. కృష్ణమూర్తి.
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి, బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
తాడిపత్రి: ఎ అబ్దుల్ బషీర్ సాహెబు
అనకాపల్లి: పి. వీరునాయుడు.
నెల్లూరు: ఏ. వి. నారాయణరావు.
ఆకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యఫ్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
టెక్కలి: శివల ఆంజనేయమూర్తి.
పార్వతిపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి. న్యూస్. ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె ధీనులు
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సీపట్నము: సి. రామన్.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తెనాలి. ది న్యూవెరైటి ఏజన్సీ
తాడేపల్లిగూడెం: జి. సూర్యారావు.
హిగిన్ బాతమ్స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును డిపాజటుతో దరకాస్తు పంపుకోనుడు.



"కాలుని పగిదిగ నతడ క్కాలంబునవచ్చి బాలుగని తన మనమం
దే లవశంకయువిడి కరవాలమ్మున బొడిచివైచి..........."

పుట. 555.




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# చెన్నరాష్ట్రపు క్రొత్తగవర్నర్ దంపతులకు స్వాగతము

చెన్నరాష్ట్రానికి నేటికి భారతీయగవర్నర్ ఏర్పడ్డారు. భావనగర్ మహారాజా గారైన కల్నల్ హిజ్ హైనెస్ మహారాజశ్రీ సర్ కృష్ణకుమార సింహ్‌జీ భావ్‌సింహ్‌జీ వారు ఈ పదవికి నియమింపబడడం సంతోషింపదగిన సంగతి. ఈ నెల 7 వ తేదిన శ్రీమహారాజావారున్నూ, శ్రీమహారాణీ విజయలక్ష్మీదేవివారున్నూ, హంసాబా, దిల్వార్ బా, రసిక్ బా—అనే పుత్రికాత్రయముతో చెన్ననగరానికి విచ్చేసినారు; శ్రీ మహారాజా వారు నిండుపేరోలగమున అధికారముద్ర స్వీకరించారు. వీరందరికి "గృహలక్ష్మి" ఆంధ్రపురంధ్రీమణుల తరఫున మంగళప్రదమైన సుస్వాగత మిస్తున్నది.

శ్రీమహారాజావారు ఈ పదవి కన్నివిధములా తగినవారని వేరేచెప్పనక్కరలేదు. వారి యాజమాన్యమున రాష్ట్రవాసు లనేకశుభపరంపరల ననుభవిస్తారనడానికి సందేహములేదు. స్వయంగా ఒకసంస్థానానికి ప్రభువు. 36 సం॥ల వయస్సుకు మించని నవయువ్వనుడు ; విద్యావంతుడు. భారతస్వాతంత్ర్యం సిద్ధించిన వెంటనే తన రాజ్యంలో

బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచిన ప్రథమసంస్థానాధిపతి; కథియవారు సంస్థానాలన్నీ కలిసిపోవాలి అని పటేలు సూచించగానే మొట్టమొదటగా అందుకుద్యుక్తుడైన మహారాజు; అంటే భావ్‌సింహ్‌జీగారి హృదయమంతా ప్రజాప్రాతినిధ్యతత్వపూరితము. వినయ విభూషణులు; ఆడంబర రహితులు. మరిన్నీ వీరు నిషావర్జించినవారట; సంపూర్ణమద్యనిషేధమునందు అత్యంతము నమ్మకము గలవారట. అన్నివిధాలా చెన్నరాష్ట్రానికి గవర్నరుగా నుండదగినవారు. ఇట్టి వీరిని బడయ గలగడం నిజంగా మనరాష్ట్రం అదృష్టమే. చల్లని ప్రభువు రాగానే చక్కటి వర్షము కురిసింది.

ఆంధ్రులును ప్రత్యేకంగా హర్షించదగినవి మరిమూడు హంశాలున్నవి. ఆంధ్రులు మంచి ఆశ్వికులు; మంచి షికారీలు; క్రికెటుక్రీడలో ఆంధ్రులకు ప్రత్యేక నైపుణ్యమున్నదని కొఠారి నాయుడుసోదరులు (సి. కె. నాయుడు, సి. యస్. నాయుడు) ప్రపంచమంతటా చాటారు; బుచ్చిబాబు సోదరులు, వారికొడుకులు—చెన్ననగరంలో నిరూపించారు. ఈ మూడింట్లోను ఈయన దిట్టలట. మరిన్నీ ఆంధ్రులైన శ్రీ వల్లభాచార్యులువారు—ఏరాష్ట్రానికివెళ్లి — రాధాకృష్ణ ప్రేమతత్వమును ప్రతిష్ఠించి ప్రచారం చేశారో, ఇంకా వారిసంతతివా రావని సాగిస్తున్నారో, ఆ రాష్ట్రంలో జన్మించారు. తప్పకుండా ఆంధ్రులయందు పక్షపాతరహితమైన ప్రత్యేకాభిమానం ఉండగలదని ఆశించవచ్చు.

మరి గృహలక్ష్ములు హర్షించవలసిన హంశమూడున్నది. ఇలాంటి ఉన్నతపదవి నిర్వహించేటప్పుడు ఆ అధికారికి తన గృహలక్ష్మి సహకారం సంపూర్ణంగాఉండాలి. శ్రీ మహారాణీ విజయలక్ష్మీదేవిగారు — ఆ విషయంలో సర్వసమర్థురాలని తెలుస్తున్నది. గోండల్ మహారాజునింట పుట్టి, భావనగర్ మహారాజునింట మెట్టిన ఆదిగర్భేశ్వరి; భర్తతో కలిసి, తమస్వంత ధనములనుండి వెచ్చించి — తమ సంస్థానంలో గ్రామపునరుద్ధరణ కార్యక్రమము సాగిస్తున్న ప్రజాసామాన్య సేవాపరతంత్ర. "గృహలక్ష్మి" కాప్యాయమైన "బ్రతుకుతెరువు" మార్గములను మనరాష్ట్రమందలి అనాధలకు చూపి, వారి నుద్ధరించుట కామె యెంతైనా కృషిచేయునని ఆశిస్తున్నాము.

శ్రీ మహారాజకుటుంబమునకు, మరొక్కసారి స్వాగతము, సుస్వాగతమని "గృహలక్ష్మి" హృదయపూర్వకముగ నుడువుచున్నది.

—:o:—

# కీ॥ శే॥ డాక్టరు యల్లాప్రగడ సుబ్బారావుగారు

(11-1-1895 — 9-8-1948)

అమెరికాలో, న్యూయార్కు పట్టణముననున్న లెడర్ లీ లేబరేటరీసునందు రీసెర్చి డైరెక్టరుగానున్న యల్లాప్రగడ సుబ్బారావుగారు 9-8-48 సోమవారం అమెరికాలోనే కీర్తిశేషులగుట విషాదకరము. విద్యకై చాలా బాధలుపడి, ధనములేక, విజ్ఞానము సంపాదింపవలెనని ఆశించి, ప్రపంచములో పెద్ద పేరుపడసిన వ్యక్తులలో సుబ్బారావుగారొకరు.

శ్రీ సుబ్బారావుగారు జయనామ సంవత్సర పుష్య బహుళపాడ్యమికి సరియైన 11 జనవరి 1895 తేదీని జన్మించిరి. వీరు జగన్నాథం, వెంకాయమ్మ గార్ల రెండవ కుమారులు. వీరికి పురుషోత్తముగారు అన్నగారు. అప్పగారు అన్నపూర్ణమ్మగారు, తమ్ములు కృష్ణమూర్తి, సత్యనారాయణగార్లు. వీరి తండ్రిగారు వీరి చిన్నవయస్సుననే చనిపోయిన కారణమున యావత్కుటుంబభారము తల్లిగారిపై బడినది. వీరితల్లిగారు అతి ధైర్య సాహస మూర్తియని చెప్పవచ్చును. యీయమపడిన యిక్కట్లు యిన్నని చెప్పనలవికాదు. అయినప్పటికి అతిధైర్యముతో కుమారులకు, చందాలు వసూలుచేసి ఉన్నతవిద్యలు చెప్పించి, పెంచి పెద్దవారినిచేసినది.

సుబ్బారావుగారు ప్రాథమికవిద్యను అమలాపురంతాలూకా మోడేకుర్రు గ్రామమందును, పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురమందును అభ్యసించిరి. వీరి అన్నగారు పురుషోత్తంగారు అప్పటికి ఎం. ఏ పట్టము నంది రాజమహేంద్రవరములో వీరేశలింగం హైస్కూలులో ఉపాధ్యాయులుగా నుండిరి. అందువల్ల కుటుంబమంతయు రాజమండ్రికి మారినది. సుబ్బారావుగారు మెట్రిక్యులేషనువరకు వీరేశలింగం హైస్కూలులోనే చదివిరి. ప్రథమ సంవత్సరము పరీక్షపోయినందున రెండవ సంవత్సరము చదువుకై మద్రాసు వెళ్ళిరి. 14 వ యేట నుండియూ వీరికి అమెరికా వెళ్ళవలెననే తృష్ణకలిగి ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండెడివారు. వీరికిజీవ శారీరశాస్త్రమునందు దభిలాష మెండు. తోటి విద్యార్థులతో కలసి కప్పలను, బల్లులను పట్టి, వాటినికోసి వాటిశారీరక సంబంధమైన విషయములు మిత్రులకు తెల్పెడివారట.

మద్రాసులో మెట్రికులేషనుచదువు పూర్తి అయి యింటరుమీడియేటు కూడా చదివి వైద్యవిద్య (Bachelor of Medicine) ప్రారంభించిరి. తమ చదువుకై కాకినాడ, రాజమండ్రిపట్టణముల చందాలు వసూలు చేసుకొనుచుండెడివారు. ఈ సమయమున, వైద్యవిద్య పూర్తిఅయిన తర్వాత విదేశము వెళ్ళవలయునన్న ధనసహాయము కలుగునా కలగదా యనే సందిగ్ధములోనుండి, వేదాంతము నందు యెక్కువ అభిలాష యుండుటవల్ల శ్రీ రామకృష్ణామఠములో చేరి, వారి ప్రేరేపణ పైననే వైద్యము చదువనారంభించిరి. రామకృష్ణా మఠముతరపున ఒక సన్యాసిగా అమెరికాకు వెళ్ళ వచ్చుననే ఆశ యుండెడిది. వైద్యము చదువు మొదటి రెండు సంవత్సరములు కాలేజీకి సరిగా వెళ్ళక రామకృష్ణామఠమునందు వేదాంతగ్రంథము లన్నియు చదివిరి. 1918 వ సంవత్సరమువరకూ వీరికి బ్రహ్మచారిగానే జీవితము వెళ్ళబుచ్చవలెనని యుండెడిది. యిప్పటికి మొదటిరెండు సంవత్సరముల వైద్యవిద్య పూర్తిఅయినది.

1918 జూన్ నెలలో సుబ్బారావుగారి పరిస్థితులు, ఆశయములు తారుమారాయెను. చందాలు వసూలుచేసుకొనుటకు కాకినాడకువచ్చిరి. అంతకు పూర్వము వీరికి చదువునిమిత్తము ధనసహాయముచేయువారెవ్వరునూ ఆసంవత్సరము చేయలేక పోయిరి. యిట్లుండగా పెద్దాపురం కాపురస్తులు కీ॥ శే॥ పింగళి కృష్ణారావుగారుఆనపర్తి కాపురస్థులైన కీ। శే॥ కస్తూరి సూర్యప్రకాశరావుగారిని కలుసుకొని సుబ్బారావుగారిని కొనియాడుతూ యిది మంచి పెండ్లిసంబంధమని చెప్పిరి. సూర్య

ప్రకాశరావుగారు పిల్లవాని గుణములకేగాని, ఆస్తికి ప్రాధాన్య మివ్వనివారగుటచే కృష్ణారావుగారు అట్లు చెప్ప సాహసించిరి. పిమ్మట కాకినాడలో కీ|| శే|| దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు కూడా సుబ్బారావుగార్కి తగిన ధనసహాయము చేయవలసినదిగా కోరిరి. పెండ్లిమాట తలపెట్టుసరికి శ్రీ సుబ్బారావుగార్కి ఆశ్చర్యము కలిగి "నావంటికడు దరిద్రునికా! మీ వంటి సంపన్న గృహస్థుల కుమార్తెను వివాహమాడుటా?" యని కస్తూరి సూర్యప్రకాశరావుగారితో అనిరి.

కస్తూరి సూర్యప్రకాశరావుగారికి విద్యాభిమానము మెండు. సుబ్బారావుగారిని అనపర్తి రమ్మని చెప్పి, వారికొమార్తెను, వారి మనుమరాలిని చూపించి యీ యిద్దరిలో యెవరినైననూ యిష్టమయిన యెడల వివాహము చేసికొనవచ్చును అనిరి. అనపర్తి వచ్చుసరికి మూడవసంవత్సరము చదువునకు ఒక్క పైసయైననూ సుబ్బారావుగార్కి వసూలు కాలేదు. చదువుయేమగునాయని విలపించుచుండిరి. అపుడు కస్తూరివారు వార్కి స్కూలు జీతము నిమిత్తము, బదులు (అప్పుగా) రు 120/-లు యిస్తూ "యీ సొమ్ము మీ విద్యకు సహాయముగా నిచ్చుచున్నాము. మీరు మా పిల్లలలో యెవరినైనా వివాహమాడినా, వివాహము చేసుకోకపోయినా ఫరవాలేదు. కాని డబ్బు యిచ్చితిమి కదాయని మీరు వివాహమునకు బలవంతము చేయుచున్నామని మాత్రమనుకొనవద్దు. మీకు వీలయినపుడు యీ సొమ్ము తీర్మానించవచ్చును." అని సుబ్బారావుగార్కి చెప్పిరి. మూడవ సంత్సరము చదువులో ప్రవేశించి అంతకు ముందు వ్యర్థపరచిన రెండు సంవత్సరముల విషయములు పూర్తిగా గ్రహించిరి. సుబ్బారావుగారు తమకు సొమ్ము అవసరమైనపుడెల్లా అనపర్తి కస్తూరి వారికి వ్రాయుటయు, వీరు సహాయము చేయుటయు జరిగెను. 1918 డిసెంబరునాట్కి వీరి మనస్సు మారినది. పెండ్లితో నిమిత్తములేకుండానే తమ చదువుకు సహాయముచేసినవారు కస్తూరివారు. వారిఅమ్మాయిని వివాహమాడిన తమచదువుకు లోపముండదని గ్రహించి 1918 డిశెంబరులో కస్తూరి సూర్యనారాయణమూర్తిగారి జేష్ఠ పుత్రిక శేషగిరమ్మగారిని వివాహమాడుటకంగీకరించిరి.

1919 జనవరిలో వీరికి ప్రాణాంతకమైన జబ్బు చేసినది. రోజుకు 70, 80, విరోచనములగుచుండెను. ఇంగ్లీషు వైద్యులు నిరాశచేసికొనిరి. ఇంతవరకు వీరికి ఆయుర్వేదమునందు నమ్మకలేదు. ఆయుర్వేదము ఒక శాస్త్రముకాదని వీరిఅభిప్రాయము. అపుడు శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు సుబ్బారావుగారిని తమ వైద్యములో పెట్టుకొని మకరధ్వజము, మజ్జిగ, కమలాఫలరసములతో వైద్యమునడిపిరి. రోజుకురోజు గుణముకన్పించి పూర్ణారోగ్యవంతులైరి. అంతటితో సుబ్బారావుగారు ఆయుర్వేదమందున్న మహత్తును గ్రహించి ఆయుర్వేదగ్రంథపఠనము ప్రారంభించిరి. యీ తర్వాతే 1919 మే 10 వ తేదీని శ్రీ సుబ్బారావుగారికిన్నీ, రామచంద్రపురం తాలూకా అనపర్తిగ్రామ కాపురస్థులు కస్తూరి సూర్యనారాయణమూర్తిగారి జ్యేష్టపుత్రిక శేషగిరమ్మగారికిన్నీ వివాహము అనపర్తిలో జరిగెను. 1920 సంవత్సరములో మద్రాసు విశ్వవిద్యాలయమున (Bachelor of Medicine) పట్టమునందిరి. తర్వాత (Master of Science) పట్టమునుకూడా నిచ్చిరి. ఈ కాలమున శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు స్థాపించిన ఆయుర్వేద. కాలేజీలో ఫిజియాలజీ ప్రొఫెసరుగా పనిచేసిరి.

1921 వ సంవత్సరములోనే జ్ఞానాభివృద్ధికై అమెరికా వెళ్ళతలంచిరి. కాని ఆ సంవత్సరము సుబ్బారావుగారి అన్నగారైన పురుషోత్తంగారున్నూ, తమ్ముడు కృష్ణమూర్తిగారున్నూ ఒకే మాసములో చనిపోవుటచే ప్రయాణము మానివేసిరి. 1923 వ సంవత్సరములో అమెరికావెళ్ళనిశ్చయించుకొని ఆయుర్వేద కాలేజీలో పని మానివేసిరి. అమెరికావెళ్ళుటకు ధనము కావలయును. అనపర్తి వచ్చి తద్గ్రామ కాపురస్థులు శ్రీ ద్వారంపూడి రామిరెడ్డిగారిని కలుసుకొనిరి. రామిరెడ్డిగారు పలుకుబడి నుపయోగించి కాకినాడలో మల్లాది



కీ॥ శే॥ డాక్టరు యల్లాప్రగడ
సుబ్బారావుగారు



శ్యామా కౌండిన్య                మణి కౌండిన్య





శ్యామా



శ్యామా

(గూడూరు డిప్యూటీ కలెక్టరు శ్రీ ఉప్పాల వెంకటేశ్వర్లుగారి పుత్రికల భరతనాట్య భంగిమలు.)

సత్యలింగంనాయకరు ఛారిటీసువారి స్కాలరుషిప్‌ను యిప్పించిరి. అదిచాలదు. వీరిమామగారగు సూర్య నారాయణమూర్తిగారికిన్ని, దొడ్డంపేటజమీందారు గారగు శ్రీ రాజావాడ్రేవు విశ్వసుందరరావు బహదూర్ గారికిన్నిగల స్నేహమువల్ల ఆ జమీం దారుగారు కొంత ధనసహాయముచేసిరి. మామగారు కూడా ధనసహాయముచేసిరి. సుబ్బారావుగారు 1923 సెప్టెంబరులో అమెరికాకు ప్రయాణమైరి. ధనములేకపోయిన సామానుఓడమీద బొగ్గువేసే పనినైనా సంపాదించి అమెరికా వెళ్ళవలెనని ప్రతిజ్ఞ పట్టిరి. అమెరికావెళ్ళుచూ లండన్ విశ్వ విద్యాలయమువారికొక సిద్ధాంతపత్రిక(Thesis) పంపి డాక్టర్ ఆఫ్ ట్రాపికల్ మెడిసన్ (Doctor of Tropical Medicine) డిగ్రీ పొందిరి. పిమ్మట హార్వార్డు విశ్వవిద్యాలయములో ప్రవేశించి బయోకెమిస్ట్రీ (Biochemistry) లో పట్టముందిరి.

శ్రీ సుబ్బారావుగారికి పరిశోధనలమూలకముగా హార్వార్డు విశ్వవిద్యాలయములో టీచింగ్ + ఫెల్లోషిప్ ఉద్యోగము లభ్యమయ్యెను. యీరోజు లలో వారుచాలాయిక్కట్లు పడవలసివచ్చెను. ధనము సరిపోవుటలేదు. అందువలన ఒక ఆస్పత్రిలో కొన్ని గంటలు రోగులమలమూత్రిదులనుయెత్తి తద్వారా కొంత డబ్బుగణించి జీవనము నడుపుతూ తమ పరి శోధనలు గావించుచువచ్చిరి. క్రమేణా వీరి ఘన తను గ్రహించి హార్వార్డు విశ్వవిదాలయమువారు ఇన్‌స్ట్రక్టరుషిప్, అసోసియేటు ప్రొఫెసరుషిప్ ఉద్యోగముల నిచ్చిరి. హార్వార్డులో నున్నకాలము లోనే వీరు Determination of phosphorous in Muscle నిమిత్తమై ఒక సిద్ధాంతమును చూపిరి. యిందువల్ల అంతకుపూర్వము పాండువ్యాధి వచ్చుటకు ఎనీమియా (Anaemia) కారణమని చెప్పబడు సిద్ధాం తములు తారుమారైనవి. వీరిసిద్ధాంతము 20 సంవత్సర ములుగా శాస్త్రప్రమాణమాయెను. యిక్కడనే Ph. D బిరుదమునొందిరి. ఇందువలననే యీయన "భారత శారీరశాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడు" అని పేరుపొందినారు.

1940 వ సంవత్సరములో యీయన పరిశోధనా శక్తులుగుర్తించి పెరల్‌రివరువద్దనున్న లెడర్‌లీ లేబ రేటరీవారు వీరిని "Director of Research" గా తీసుకున్నారు. శాస్త్రపరిశోధనకు వీరికి యిక్కడ తగిన అవకాశముకుదురుటచే మాతృదేశమునకు తిరిగివచ్చుటకు మనస్కరించలేదు. లెడర్‌లీలో చేరకముందు వీరు యెన్నిరోమార్లు స్వదేశమునకు తిరిగిరావలెనన్న అభిలాషతెల్పుతూ బంధుమిత్రులకు వుత్తరములు వ్రాసియుండిరి. లెడర్‌లీలో చేరిన తర్వాత ధనము సమృద్ధిగా లభించెను. తమచదువుకై మామగారు యిచ్చిన ధనము అప్పుక్రిందభావించి యీ ఋణము యెన్నటికైనా తీర్పగలుగుదునా? అట్టిసుదినము యెన్నడైనా దొరుకునా? అని ఆవేదన పొందుతూ వుత్తరములు వ్రాశేవారు. లెడరలీలో చేరినతర్వాత మామగారికి అణాపైసలతో ఋణముతీర్చివేసి ఋణవిముక్తులైరి.

లెడర్‌లీ లేబొరేటరీసులో వీరు మానవజీవిత సంరక్షణార్థమై చేసినపరిశోధనలు వీరినిమహోన్నత పదవికిచేర్చినవి. పెనిసిలిన్, స్ట్రెప్టొమిసిన్ మందులు రెండవ సంగ్రామకాలమందు విరివిగా, సైనికులు మృత్యుముఖమునుండి రక్షింపబడునట్లు, దొరుకుటకు వీరి పరిశోధనలే కారణములు. యీ మందులు యిప్పుడు పల్లెపల్లెకు కూడా లభ్యమగుచున్నవి. యీ మధ్యనే పెనిసిలిను, స్ట్రెప్టొమిసిన్‌మందులకు లొంగని అంటువ్యాధు లణచుటకు,వీరు యితరశాస్త్రవేత్తలతో కలసి "ఆరియోమిసిన్" అను మందునుకనిపెట్టిరి. Pernicious Anaemia కొరకు Folic acidఅను మం దును కనిపెట్టిరి. ఫైలేరియాసిస్ అనేది ఒక అసహ్య కరమైనవ్యాధి. దీనినినే బోదకాలు అంటారు. అట్లా అన్నా ఒకకాలికేకాక, అవయాంగములలో దేని కైన ఇది ఆపాదించవచ్చు. ఈ వ్యాధి ఉష్ణదేశాలలో హెచ్చు; ఇండియా, ఆఫ్రికా, దూరప్రాచ్యదేశములు మున్నగు ప్రదేశాల వేలకొలది, లక్షలకొలది ఈ వ్యాధిచే బాధపడుచున్నారు. దీనికిన్ని శ్రీ సుబ్బా రావుగారు మందుకనిపెట్టినారు. జీవకోటిని రక్షిం చుటకై యెన్ని మందులు కనిపెట్టితేనేమి? తనకు చావు తప్పదాయెను! రోగమేదైనా కుదుర్చుటకు

అవకాశమివ్వకుండా అకస్మాత్తుగా విధి వీరిని గుండెజబ్బు వల్లలాగివేసినది.

శ్రీ సుబ్బారావుగారి మరణమువల్ల శాస్త్రపరిశోధనా ప్రపంచములో ఒక మణిపూసరాలిపోయినది. న్యూయార్కు హెరాల్డుట్రిబ్యూన్ పత్రిక సుబ్బారావుగారి మరణమునుగురించి సంపాదకీయ వ్యాసమువ్రాస్తూ "ప్రపంచములో తమకుతెలియని విషయములెన్నోయున్నవి అవన్నియు తెలుసుకోనవలెననే ఆవేదన పొందుతూయుండే మహావ్యక్తి, సామాన్యమానవునితోపోల్చిన శ్రీ సుబ్బారావుగారు, విశ్వజ్ఞాననిలయమని చెప్పవచ్చును. అట్లనిననూ వారికి సంతృప్తికాదు" అని వ్రాసినది.

మూడు సంవత్సరములు విదేశములలో జ్ఞానాభివృద్ధికై వుండవలెననే తలంపుతో అమెరికావెళ్ళి, 1939 వ సంవత్సరములో కూడా స్వదేశమునకు వచ్చుచుంటినని మిత్రులకువ్రాసి, చివరకు 25 సంవత్సరములు అమెరికాలో వుండి అక్కడనే మరణించిరి శాస్త్రపరిశోధనావకాశములు, అమెరికాలో వీరికిసంకెళ్ళయి మాతృదేశమునకు రాకుండా చేసినవి. ఇట్టి శాస్త్రనిధి అస్తమయమువల్ల అశేషభారతజాతి, అంతేకాదు యావత్ శాస్త్ర ప్రపంచము విలపించుచున్నదే!

శ్రీ సుబ్బారావుగార్కి జ్యోతిశ్శాస్త్రమందు చాలా ప్రవేశముకలదు. దేశాభిమానము చాలా మెండు. అహింసాపద్ధతివల్ల గాంధీమహాత్ముడు విశ్వమానవ ప్రపంచశాంతి సాధించగలడనే నమ్మిక తెలుపుతూ 1924 లో వీరు వుత్తరములోవ్రాసిరి.

అమెరికాలో వీరు కారునడుపుట, గుర్రపుస్వారీ, విమానమునడుపుటనేర్చి లైసెన్సుపొందిరి. రోజుకు 18 గంటలు కృషిచేసెడివారు. తమ పరిశోధనాసక్తి తీర్చుకొనుటకై (Research) కట్టుకున్న భార్యను కూడా గణించక, పరిశోధనాగారంలోనే కాపురమై బ్రహ్మచర్యముతో 25 సంవత్సరములుగడపిరి.

శ్రీ సుబ్బారావుగారు యింతవృద్ధిలోకివచ్చుటకు కారణభూతులైన కస్తూరి సూర్యనారాయణమూర్తి గారున్నూ, 25 సంవత్సరములు భర్తృవియోగమున తపించుచు నేటికి పసుపుకుంకుమలనుగోల్పోయిన వారి భార్య శ్రీమతి శేషగిరమ్మగారున్నూ ఇతర బంధుజాలమున్నూ అనపర్తిలో కలరు. వీరిసోదరులు సత్యనారాయణగారు సోంపేటలో జిల్లా మునసబుగా వున్నారు. వీరి వృద్ధమాతృదేవి వెంకాయమ్మగారున్నూ, సోదరి అన్నపూర్ణమ్మగారున్నూ, మేనల్లుళ్ళు తల్లాప్రగడ రామచంద్రరావు జగన్నాథరావుగార్లున్నూ కాకినాడలో వున్నారు.

శ్రీ సుబ్బారావుగారి మరణవార్తవిని, సుబ్బారావుగారు అమెరికా వెళ్ళుసరికి 3 సం॥ రములు వయస్సుగల బావమరది కస్తూరి శ్రీనివాసరావుగారు విలపించుచుచూ, మనస్సు నిల్పుకోనలేక, పసుపు కుంకుమలు కోల్పోయిన సోదరిని చూచుటయెట్లు? అని తపించుచు సుబ్బారావుగారు చనిపోయిన వారమురోజులలో 17-8-48 తేదిని బావగారిని కలియుటకు ప్రాణములర్పించిరి.

కస్తూరి రామచంద్రరావు.

(బి. ఎస్ సి)

* * * *

శ్రీ డా. యల్లాప్రగ్గడ సుబ్బారావుగారు కీర్తిశేషులైనందులకు ఒక్క ఆంధ్రదేశంలోనేకాదు, భారత దేశంలోనేగాదు - వారి చరిత్ర తెలిసినవారు ప్రతివారు ప్రపంచంలో ఏమూలనున్నా చింతించకపోరు. "గృహలక్ష్మి" ప్రత్యేకంగా గమనించదగినవి వారిచరిత్రలో రెండుమూడు హంశాలున్నవి. చిన్నతనంలోనేతండ్రి చనిపోయిన బీదబాలుని, సుబ్బారావును, అష్టకష్టాలుపడి చదివించి వృద్ధికి తెచ్చినది వారితల్లి.

ప్రతీతల్లి ఇలా శ్రద్ధవహించి దీక్షతో, కష్టనష్టాలకు ఓర్చి, తనబిడ్డలకు చదువుచెప్పిస్తే, ఏగనిలో ఏరత్నమున్నదో ఎవనికెరుక - అంతస్సత్వముగల రత్నము రాణిస్తుంది.

కారణజన్ములైన సీతారాములను సేవించడానికి, లక్ష్మణుడు అడవికివెళ్లగా, అతనిభార్య ఊర్మిళ దుస్సహమైన భర్తృవియోగమును నిద్రావస్థలో గడిపివేసింది. దివ్యాస్త్రబంధితుడై, మృతప్రాయుడయ్యు, సంజీవిధర్మాన చిరంజీవియై అతడుఇంటికి వచ్చాడు. శ్రీ సుబ్బారావుగారి ధర్మపత్ని శ్రీమతి శేషగిరమ్మగారు పూర్వప్రాయాన నాలుగైదునెలల మాత్రపు తొలికాపురముతోనే, ఇంకా క్రొత్తతీరకముందే - ఆపన్న సత్వను-(ఆ ఫలము కనుపించి త్వరలోనే కనుమరగిపోయింది.) తన్ను వదలి భర్త విదేశాల ఉన్నతవిజ్ఞానాసక్తుడై వెళ్లగా దుర్భరవియోగావస్థ నిన్నాళ్లు 'తిరిగివస్తారు,' అనేకలల్లో గడిపివేసింది; 'రేపో, మాపోవస్తాను' అనే వుత్తరాల కబుర్లతో ఆ ఆశను పోషించుకున్నది. కాని, లోకానికంతా సంజీవినీ ఔషధాలుప్రసాదించి కోట్లకొలది రోగులకు ప్రాణదానం చేసిన తనభర్త, ఇన్ని దివ్యౌషధాలు కనిపెట్టిన్నీ 'మృత్యుంజయుడనైనానా?" అన్న ఆర్తితో, ఆవేదనోద్వేగములతో, అలమటించాడు కాబోలు! - గుండెఆగి, శాస్త్ర పరిశోధనాలోకాన్ని, తన చిన్నహృదయాన్ని, అంధకారబంధురంచేసి, ఆమృత్యువువాతనే పడ్డాడన్నదుర్వార్త, చాతకపక్షిపై పిడుగుపడ్డట్టు, ఆమె నణచివేసింది. పుత్రవియోగంతో కుందే ఆ ఆమాయకపుతల్లిని, - భర్తృవియోగంచేత కృశించి కృంగిపోతూన్న - ఆయన భార్యను-"గృహలక్ష్మి"తో పాటు పాఠకులందరు, ఆదరించి సానుభూతిచూపుతారని ఆశిస్తున్నాము.

వేడబంగాని, లోకారాధ్యులు, లోకసేవకులు అయిన మహాత్ములు - లోకబాంధవులుగాక, వ్యక్తులకు పుత్రులు, భర్తలు అనే బాంధవులెట్లవుతారు? అదికేవలం నిమిత్తమాత్రం! అయితే, నాగార్జునినిగన్న ఆంధ్రమాత, 1700 సం॥ లైనా గొడ్డువోలేదని రుజువుచేసిన శ్రీ సుబ్బారావుగారి వంటిపుత్రుని కనవలెనని ఏ తెలుగుతల్లికోరదు? అట్టి భర్తను బడయవలెనని, ఏ తెలుగుబాలిక నోములు నోచదు? వారి వారి కోరిక లీడేరుగాకయని ఆశించుచు, శ్రీ సుబ్బారావుగారి భార్య, తల్లి, మామ, బావమరుదులు, సోదరీ సోదరులు - ఇంకను తక్కుంగల బంధుమిత్రులు - ఎల్లరికి మాసానుభూతి తెలుపుచున్నాము.

గృ॥ సం,



# ప్రేమ పిలుపు



అదిమనోహరమైన బృందావనంబు ;
వినుము మధురాతిమధురమౌ వేణురవము ;
రాధకాబోలు ప్రణయసామ్రాట్టు గృష్ణు
వెదకుచున్నది పిలుచుచు ప్రేమపిలుపు.

హానవమోనాంగ కుసుమాస్త్రవినిర్జితరూప ! వేణుసం
ధానరవంబునా హృదయతంత్రులుమీటి, భవన్ముఖేందునిన్
నా నయనోత్సవంబుగ, గనంబడనీయక డాగి, యిట్టు లెం
తేని విరాళి వెట్టతగునే చనుదెమ్మిక సంధ్యయయ్యెడున్ !

ఏమిది కోపమా ? పలుక వేలను ? నాదగు నేరమెద్ది ? నే
నేమి పరాయిదానన ? యీ కేలను జాలముసేయ ? కొంటెగా
డా మధురాధరోదిత సుధారసధారలు కాన్కవెట్టుదున్
శ్యామలకోమలాంగ కుసుమాంజలి పూజల నందుకో గదే!



మధురపీయూష కలిత సంభరితమైన
నీదుపలుకులు ముదమిచ్చు నీదుచెంత ;
యెడమయ్యె నీవు, యవి జ్ఞప్తివొడమునేని
కాలకాకోలవిషమునా గాల్చుమదిని.

దయసేయంగదె రాధికాహృదయనాథా ! ముద్దుకృష్ణా ! సదా
ప్రియతాత్మన్ జపియించు నాపయిని, నిర్దాక్షిణ్య మేలాయిటుల్ ?
భయమున్ గ్రాలెడి ! మూర్ఛవచ్చె ! తనువావాడెన్ ! శ్రమంబయ్యె న
య్యయొ ! రావే ! నవనీతమౌ మనసు కాయల్ గాసె నేమోసఖా ?

ఏచోటన్ మునుముచ్చటల్ సలిపినా మేచోట క్రీడించి నా
మేచోటన్ కుసుమాస్త్రకేళితనినా మేచోటకూర్చుంటి మే
మేచోటుల్ విహరించి యే పొదలలో నేరీతిగా నుంటిమో
యా చోటుల్ గనినంత నాయెడద వ్రయ్యల్ గాదె ! రావేసఖా !

దివ్యదేదీప్య సౌందర్య దేవ రావె ;   అతులసూనాస్త్ర భోగభాగ్యంబుగనవె ;
రావె; రక్షింపవే వేగ ప్రాణనాథ;   నాథ ! జననాథ ! నా మనోనాథ ! కృష్ణ !;

గుండాబత్తుల లక్ష్మిబాయ్



# రేడియో

## సంపూర్ణ జీవనానికి సాధనాలు

"తృప్తి"

శ్రీమతి సత్తిరాజు సూర్యకాంతమ్మగారు

మానవజన్మ. ప్రపంచమందలి, జీవరాసులలో, ఉత్కృష్టమైనదని, అందరూ అంగీకరించిన విషయమే. అయితే, ఈ ఔన్నత్యం ఎందుచేత, మానవజీవితానికి కల్గింది అనే సమస్య, జీవితపరమావధి, ఏమిటో గ్రహించి, జీవితాన్ని సాఫల్యం చేసుకుందామని ప్రయత్నిస్తూ, యుగ, యుగాలుగా, సాధిస్తూ వస్తూఉన్న మేధావంతులైన వేదాంతులనూ, లౌకికులనూకూడా, వేధిస్తూనేఉంది. ప్రతివ్యక్తికీ, బాల్య యవ్వనాది, వివిధావస్థలలోనూ జీవితపరమావధి, వివిధరూపాలను పొందుతూ ఉన్నట్లుగాఉండి దాగుడుమూతలు ఆడుతూఉంటుంది. ఇట్టిపరిస్థితిలో, కొందరు కవులకు జీవితంఅన్నది, పుచ్చపువ్వువంటి పండువెన్నెలగా, రేపుఅనే రోజువస్తుంది అనే చింతలేకుండా, అనుభవించవలసిందిగానూ; మరికొందరికి కారుమబ్బులతో భయంకరరూపాన్నిదాల్చిన, జీమూతంగానూ కాముకులకు, కేవలం కలియుగవైకుంఠంగానూ; విరాగులకు, వట్టిమిధ్యగానూ; వేదాంతులకు పరమేశ్వరుని లీలగానూ, ఇట్లు మానవజీవితం పరిపరివిధాలుగా గోచరిస్తూ, అంతరార్థాన్ని మరుగుపరుస్తూ పరిణమిస్తుంది. జీవితం అంటేనే ఏమిటో నిర్ధారణకాకుండా ఉన్న మానవుడు, సంపూర్ణజీవితం సాధించడానికి ప్రయత్నించడం యడారిలో ఎండమావుల్ని జలాశయాలుగా భావించి పరుగులెత్తటంలాంటిది - అయితే ప్రతివ్యక్తీన్నీ, అప్రయత్నంగానయినా, జీవితంలో ఈ పరువులెత్తటం మానటంలేదు-మానదు- మానకూడదు; ఏమంటారా? యడారి ప్రయాణీకుని దప్పికవంటి ఏదో ఒకవిధమైన 'ఆశ' జీవితంలో వ్యక్తులకు లేనప్పుడు, ప్రపంచం స్థంభించిపోతుంది. కాలచక్రం ఆగిపోతుంది. లక్షాధికారి కోటీశ్వరుడు కావాలనీ, పేదవాడు భాగ్యవంతుడు అవాలనీ; చిన్నఉద్యోగస్థుడు ప్రమోషను అయి పెద్దఉద్యోగం చేయాలనీ, వ్యాధిగ్రస్థుడు ఆరోగ్యవంతుడు కావాలనీ; గొడ్రాలు సంతానవతి కావాలనీ; సామాన్యగృహిణి సిరిసంపదలతో తులతూగాలనీ; ఈ విధంగా ఆశిస్తూ వ్యక్తులు జీవితాన్ని సాధిస్తూఉంటారు. ఇట్టి కోరికలలో దేనినైనా అస్వాభావికం, అనిగాని, మంచిదికాదనిగాని, చెప్పగలమా? ఆయావ్యక్తులకు తమతమకోరికలు నెరవేర్చుకోవటమే, జీవితాశయాలుగా ఎంచుకుంటూ ప్రవర్తించటంచేత, సర్వతోముఖమైన సామాన్య సాంఘిక జీవితం సాధించలేరు,

నా ఉద్దేశ్యంలో, సంపూర్ణజీవితం అనేది, అర్థంలేని ఆశయం. మనం సాధించటానికి పూనుకోవలసింది, బాధ్యతాయుతమైన సమాజికజీవితాన్ని, ఒడుదుడుకులులేకుండా సఫలీకృతం చేసుకోవడం. ఎంతటివివేకం, విజ్ఞానం, విచక్షణలతో ప్రవర్తించినా, మానవునికి, ముఖ్యంగా 'సంతృప్తి' అనే మానసిక ప్రవృత్తిలేకపోతే, ఈ జీవితసాఫల్యతకూడా, అసాధ్యంఅవుతుంది. అసాధ్యమేకాదు-భరించరానిదికూడా అవటానికి, సావకాశం కలుగుతుంది.

సంతృప్తి, 'ఓర్పు' అనే అక్కగారిని అనుసరించి ఉండటం మూలాన్ని, ఈఅక్కచెల్లెండ్రు ఇద్దరూ, మన హృదయాలను ముట్టడించి ఆక్రమించేటందుకు మనం ప్రయత్నించాలి.

మానవుని, 'మనస్సు' ప్రకృతికి అంతటికీ భయంకరమైనట్టి, అధికబలసంపన్నమైనట్టి జీవశక్తి. ఈమహాశక్తిని, తగునిర్బంధనలతో. కట్టుదిట్టంచేసి, ప్రయోజనకారి అయ్యేటట్టు చూడటమే, ఏనాగరికతయొక్కగాని, మతముయొక్కగాని, న్యాయశాస్త్రముయొక్కగాని, సంస్థయొక్కగాని, కర్తవ్యము. ఈ కర్తవ్యం, సరిగా నిర్వహించటంలోనే, మానవజన్మయొక్క ఔన్నత్యం బోధపడుతుంది.

మన అనుభవంలో, ప్రత్యక్షంగా, రోజూ చూస్తూఉన్న, కొన్ని సంసారాలని, ఉదాహరణలుగా తీసుకుని, 'తృప్తి' అనేది లేకుంటే, మానవజీవితం, ఏరీతిగా పరిణమిస్తుందో, తెలుసుకుందాం. ఆశించిన దానికిగాని, నిజంగా అవసరమైన దానికిగాని, తక్కువ ఉన్నవారికి. ఉన్నదానితో సంతుష్టిపడడం, ఎట్లు అవసరమో, అట్లే, వలయుదానికి, అదృష్టవశాన్ని, ఎక్కువ ప్రాప్తమైనవారికి, 'త్యాగం' అనేది, అంత అవసరం. ఒక ప్రక్క త్యాగం, రెండవవైపున తృప్తి, సమానంగా ఆచరణలోకి వచ్చిననాడే, మనం వింటూ ఉన్న 'సర్వమానవసమత్వం' అనే ప్రజాస్వామ్యవాదుల పొలికేకలుగాని, మనస్త్రీలు 'సమానహక్కులు' అంటూచేసే దుందుభినాదాలుగాని, ప్రయోజనకారులు కానేరవు. సమానత్వం, ప్రపంచంలో, ఏ విషయంలోకూడా కనబడదు. మనచేతివ్రేళ్లలోనే, హెచ్చుతగ్గులున్నాయి. సమానఅవకాశాలు పొందవచ్చునుగాని అందుమూలంగా సమానత్వం చేకూరుతుంది అనుకోటం, వట్టి వెర్రి. అందుచేత మనం, అందని పండ్లకు ఆశించకుండా, ఉన్నదానితో తృప్తిపడి, జీవితాలను సుఖంగా గడుపవలసిన అగత్యం మధ్యతరగతి ప్రజలకు ఎక్కువగాఉంటుంది.

రాజమ్మ, స్కూలు ఫయినలు పాసయింది; నూటయాభయి రూపాయలు వేతనం, నెలకుతెచ్చుకుంటూఉన్న గుమాస్తా భార్యగా, ముగ్గురుపిల్లలతో పట్నవాసపు కాపురం; సరోజ పొరుగింటి వెయ్యి రూపాయల నెలవేతనంగల ఇంజనీరుగారిభార్య; రాజమ్మ, సరోజలు ఇంచుమించు ఒకే ఈడువారు. ఇద్దరూ సమానంగానే చదువుకున్నారు. ఇద్దరి పుట్టింటివారూ సామాన్య కుటుంబీకులే. సరోజఉండేది పూలమొక్కలూ, ఫలవృక్షాలూ ఉన్నతోటలోని చక్కని బంగళా. మోటారుకారు, నౌకర్లూ, చాకిర్లూ, కాలేజీలో చదువుతున్న ఒక్క కుమారునికీ ప్రత్యేకం చిన్నమోటారుకారు. కట్టినచీర తిర్గికట్టకుండా రకరకాల విలువైన దుస్తులతోనూ, రవ్వల నగలతోనూ సీతాకోక చిలుకలాగ, కాలు క్రిందపెట్టకుండా జీవితం గడుపుతుంది.

రాజమ్మ, విశ్వప్రయత్నంమీద లోపాయకారీగా రసీదులేకుండా రెండువందలు అడ్వాన్సు, బ్రోకరుద్వారాఇచ్చి సంపాదించిన, అద్దెకొంపలో ముప్ఫయిరూపాయల వాటాలో కాపురం. భర్త ఆరోగ్యుడూ, సౌమ్యుడూకూడా; పిల్లలు వినయవిధేయులు. దగ్గరలో ఉండటంవల్లనూ, ఇద్దరు కుమార్లూ

# సంపూర్ణ జీవానానికి సాధనాలు

ఒకే తరగతిలో ఒకే కాలేజీలో చదువుతూ, రాజమ్మ కొడుకు క్లాసులో మంచిమార్కులు తెచ్చుకోవటం మూలాన్ని, రాజమ్మ సరోజలకు స్నేహంకుదిరింది. ఆ సోఫాలు, ఆ నౌకర్లు ఆ వైభోగం చూస్తూఉన్న రాజమ్మ, మానసిక పరిస్థితి ఎలాఉంటుందో ఆలోచించండి. పిల్లల జీతాలు, పుస్తకాలు, దుస్తులకుపోగా మిగిలిన రాళ్లతో, నాల్గువ్రేళ్లూ నోటిలోనికిపోకుండాఉన్న, రాజమ్మకు అసహనం, జీవితంమీద ద్వేష విరక్తులూ, సృష్టికర్తయైన తండ్రియే, పిల్లలందు విపరీత, వివక్షత చూపడంవల్ల, నాస్తికభావం; కలుగుతాయంటే విచిత్రం ఏముంది. ఇట్టిభావాలు కలుగగానే, తృంచేయటమో, అణచివేయటమో జరుపకుంటే, రాజమ్మ జీవితం ఏమవుతుంది? ఇట్టి సందర్భంలోనే 'సంతృప్తి' అనేభావం, సహాయపడి, జీవితం దుర్భరం, దుఃఖభూయిష్టం కాకుండా కాపాడుతుంది. నాకు భగవంతుడు ఈ జన్మలో ఇంతే ఇచ్చాడు, దీనితోనే తృప్తిపడి సంతోషించాలి; అని రాజమ్మ నిర్ధారణచేసుకుని ప్రవర్తిస్తేనే ఆమె జీవితం భరించతగి సార్థకం అవుతుంది. అట్టి తృప్తిలేనినాడు రాజమ్మ ఏదో వంకబెట్టుకుని. పగలంతా ఆఫీసులో కాగితాలలో కుస్తీపట్టి; విసిగి వేసారి ఇంటికిచేరిన భర్తను రావటంతోనే, ఇదిలేదు; అది తీసుకురాలేదు, అంటూ సాధింపులతో, 'వంట్లో బాగులేదు; - హోటలునుంచి తిండితెచ్చుకోండి' అని విసుగుదలచూపటం, పిల్లలను చీటికీ మాటికీ అకారణంగా తిట్టుతూ కొట్టుతూ ఉండటం. ఈ విధంగా పరిపరివిధాల వికార చేష్టలతో తన జీవితాన్ని చేతులారా పాడుచేసుకోవటమే కాకుండా, రాజమ్మ తన సంసారంలోని అందరి జీవితాలకూ, కూడిరానిభంగం కలుగచేస్తుంది. "రాజునిచూచిన కళ్లతో మగనిచూస్తే మొత్తబుద్ధిపుట్టిం"దని పెద్దలు ఊరికే అన్నలోకోక్తికాదు: సంసారపుగుట్టు, గృహిణియేకాపాడాలి. రాజమ్మ భర్తనెలకు నూటయేభయితెచ్చి తనచేతిలో పోయగలడు, అంతే. దాన్ని సక్రమంగా గుట్టుగా వినియోగించే బాధ్యత తనది అని రాజమ్మ గ్రహించినప్పుడు ఓర్పు, తృప్తిఅనేవి వాటంతట అవే, ఆమె సహాయానికివచ్చి, రాజమ్మ సంసారంచూచి సరోజకూడా విస్మయంచెందేటట్టు చేయగల్గుతాయి. జీవితంలో తనకేకాకుండా తన భర్తకూ, పిల్లలకూ ఆనందం, సాఫల్యత చేకూర్చగల్గుతుంది రాజమ్మ.

సరే, బాగానేఉంది; కాని, తృప్తిపడటంవల్ల, వ్యక్తుల ఆశయాలు అడుగంటి, అభివృద్ధికి భంగం కలగదా? అని కొందరు సోదరీమణులకు అనుమానం కలుగవచ్చును. ఆదర్శరీత్యా కాకుండా, అనుభవ పరంగాచూస్తే, ఈ అనుమానం, నిరాధారం అని తెలుస్తుంది. ఎక్కడో కోటివ్యక్తులలో ఒకడు చెప్పులు కుట్టుకునేవాడో, వార్తాపత్రికలు వీధుల్లో కేకవేస్తూ అమ్మేవాడో ఒక దేశానికి ప్రధానామాత్యుడు అయ్యాడు అని అందరూ అలా కాగలరా? ఆ సంఘటనలు, నిమిత్తమాత్రాలు, అని మనం గ్రహించాలి. తృప్తిచెందినంత మాత్రాన అభివృద్ధికి కృషిసల్పటం మానుకోవాలని ఉంటుందా? అందని పండ్లెమిటో, అందుబాటులోని పండ్లేమిటో వివేకంతో యోచించి, వాటికోసం ప్రయత్నించటమో, మానటమో జరగాలి. అంతేకాని "ఎక్కడున్నావు కంబళీ, అంటే వేసినచోటనేఉన్నాను" అనడం తృప్తికి అర్థం కాదు. కోరికలూ, అభిరుచులూ అందరికీ ఉండాలి. వాటిని సాధించగలమా? ఏ విధంగా సాధించాలి అనేదే మనం ఆలోచించి, జీవితం సంతృప్తి మార్గంలో సాఫల్యం చేసుకోవాలేగాని, అత్యాశలకులోనై దుఃఖావహమూ, నిరర్థకమూ గావించుకోకూడదు. కాబట్టి ఏ దృష్టితోచూచినా 'తృప్తి' మన సాధారణ సాంఘిక బాధ్యతాయుత, జీవితాలను సాఫల్యం చేసుకోడానికి చాలాఅవసరం అని ఋజువు అవుతుంది. సంతృప్తి జీవనం సాఫల్యసాధనం.

A. I. R. అనుమతిని

—:0:—

# నేటి బడులలోని విద్య బాలికలకు ఎందుకూ ఉపకరించదు



శ్రీమతి గుడిపాటి మహాలక్ష్మిగారు

చదువుకొనినవారంటే ఇంగ్లీషునేర్చినవారే అనుకోవడము మనలో పరిపాటయింది. అదివట్టి పొరబాటభిప్రాయము. ఈ అభిప్రాయమునకు కారణము రాజభాష కావడమే. ఎవరిభాషలో వారు క్షుణ్ణంగా చదవను వ్రాయను నేర్వడము విద్య నభ్యసించడమే అవుతుంది. విద్య రెండువిధాల ఉపయోగపడుతుందనవచ్చును (i) మానసికవికాసానికి (ii) జీవనోపాధికి. ఈ దృష్టిలో చూస్తే నేడు బడులలో, కాలేజీలలో బాలబాలికలకు నేర్పే విద్య గులాములను, గుమాస్తాలను, బానిసలను తయారుచేస్తోంది. ఈవిద్యావిధానము మనజాతిని ముందుకుతీసుకొనిపో లేదు. బాలబాలికలను జాతికి అన్నివిధాల ఉపయోగపడేలాగ తయారుచేయలేదు....

గులాములను, గుమాస్తాలను, తయారుచేసేబడులు కొంతవరకు తమ జీవనోపాధిని సంపాదించుకోటానికి యువకులకు తోడ్పడినా, తల్లులుకాబోయే యువతులకు యెందుకు పనికిరావడంలేదు.

పురుషులతోబాటు ఉద్యోగాలు చేయడమే, స్త్రీల ప్రధానమైన పనికాదు. ప్రతి పడతి తల్లిఅయి ఉత్తమసంతానాన్ని ముందుజాతికి అందియ్యడంకూడ అవసరం. అంతమాత్రంచేతనే స్త్రీలు సంతాన ఉత్పత్తియంత్రాలనే దురభిప్రాయం పడడం తగదు. స్త్రీ, పురుషుడు సంపాదించిన సొమ్మును సరిగా యింటివిషయంలో వినియోగపర్చుకొనే తెలివితేటలు సంపాదించుకోవాలి. చక్కగా పోషించిపెంచడం నేర్వాలి. శుచి, శుభ్రతను తెలుసుకోవాలి. ఉత్తమ బాలబాలికలను తయారుచేయాలి.

ఈ దృష్ట్యాచూస్తే నేటిబడులలో నేర్పేవిద్య, బాలికలు ఉత్తమ గృహిణులై జాతీయాభ్యుదయానికి తోడ్పడేలాగ లేదు. నేటి విద్యాసంస్థలలో చదువునేర్చినవారిని పరిశీలిస్తే ఈలోట్లు వారిలో కంటికి కట్టినట్లు కనబడుతవి. చదువుకొనినవారైనా ఆదర్శ గృహిణులుగాను, వీరవనితలుగాను కానవస్తూన్నారంటే అందుకు వారి తెలివితేటలు, పెద్దలనుండీ నేర్చుకొన్నవి, ఉత్తమస్త్రీల జీవితగాథలు కారణము. అంటే ఈ నాటి బడులు నిజమైన విద్యను స్త్రీలకు చెప్పడంలేదని రుజువవుతోంది.

ఈనాడు సమాజంలో యువతి అన్నిరంగాలలో చేదోడు వాదోడుగా యువకునకు వుండవలసిన అవసరంవుంది. ఆర్థికంగాకూడా తోడ్పడవలసివుంది. రోజు వారి యింటి పనులలో (i) పనిమనిషి (ii) వంటమనిషి (iii) దాదులు (సామాన్యకుటుంబాలలో) మొదలైన పనివారలు లేకుండ స్వయంగా తామే చేసుకోగల గృహిణులు ఆర్థికంగానే

కాకుండ శారీరకంగా, మానసికంగా ఎంతో ఆనందాన్ని సౌఖ్యాన్ని పొందవచ్చు. కుట్టు పనులుద్వారా తమ కుటుంబానికి వలయు దుస్తులను తక్కువఖర్చులో తయారుచేసికొన వచ్చు. ఇంకా వీలైతే చిన్న చిన్న కుటీరపరిశ్రమలద్వారా ధనార్జన చేయవచ్చు. చదువు నేర్చిన తల్లులు తమబిడ్డలకు వేరే ట్యూటర్లు లేకుండానే రుద్రమదేవి, శివాజీలలాంటి ఉత్తమ యువతీయువకులుగా, తయారుచేయవచ్చును...

ఈవిధంగా అన్నిరంగాలలో యువతులు యువకులకు ఉపకరించేలాగు, జాతి ముందడుగు వేసేలాగు చూడాలన్నా బాలికలకు పన్నెండుఏండ్లవరకు బాలురతో కలసి చదివే ఏర్పాటుచేయడం; ఆపైన ప్రత్యేకపాఠశాలలు తెరచి (i) శిశుపోషణ (ii) పాక కళ, (iii) ఆరోగ్యశాస్త్రము, (iv) మితవ్యయము (v) కుట్టుపనులు, (vi) లలితకళలు నేర్పే అవకాశాలు కల్పించాలి. అప్పుడు స్త్రీలు రాజకీయంగా అర్థికంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా, పురుషులకు తోడ్పడటానికి, ఉత్తమసమాజాన్ని సృష్టించడానికి వీలుంటుంది. నేటి విద్యావిధానంలో ఈలాటిమార్పును వెంటనే త్వరపడానికి ఆంధ్రమహిళలు కృషిచేయాలి; వీరికి ప్రజాప్రభుత్వం చేయూతనివ్వడం ఎంతో అవసరమని గుర్తించెదరని తలుస్తున్నాను.



# మాతృహృదయము

చంద్రమోహిని ఓంప్రకాశశర్మ కూతురు. ఒక్కతేఒక్కకూతురు గనుక తండ్రి ఆమెను చాల గారాబంతో పెంచాడు. ఆమెకు నల్గురు అన్నదమ్ములున్నప్పటికి ఆమెయే తనతండ్రికి ప్రాణము, హృదయము. పెద్దదైనతరువాత తండ్రి చాలవైభవముగ ఆమెకు పెండ్లిచేశాడు. కాని పాపభీతిలేని ప్రారబ్ధమువల్ల ఆమెభర్త మృత్యువాతపడ్డాడు. పాపము ఆమె జీవచ్ఛవమువలె పుట్టింటికి వచ్చింది. తండ్రి ఆమెనుచూచి హృదయములో అపరిమితమైన బాధను సహించుచు దానిని అణచుకొని ఆమెను వోదార్చుస్తుండేవాడు. ఆమె తనదుఃఖమును తండ్రియొక్క నిర్మలమైన ప్రేమవల్ల అప్పుడప్పుడు మరచిపోతుండేది.

ప్రపంచములో ప్రేమ పరిశుద్ధమైన సరస్సని అన్నప్పటికి దానియడుగున వ్యాపించియున్న పంకిలము వంటిదే, ప్రేమయందు దాగియున్న స్వార్థముకూడాను. ఓంప్రకాశశర్మ ఒకవిధముగా స్వార్థపరుడే. చంద్రమోహినికి యిదివరకు జీవితములో, కొంచము ఆధారముగయుండిన ఆ ఒక్క సంతానముగూడ యిప్పుడులేదు. అసలు మామగారు ధనికులు. ఆయన తన పెద్దకుమారుడు శశిభూషణాన్నీ, కోడలు చంద్రమోహినిని చూచుకొని ఆనందాంబుధిలో ఓలలాడుతుండేవాడు. తన ఆస్తి అంతయు పెద్దకుమారునిపేర వ్రాసి ఆయన తన రెండవకుమారుడైన ఇందుభూషణుని అతనికే అప్పగించి స్వర్గస్థుడయ్యాడు. చంద్రమోహిని అత్తగారుకూడ మరుసటి సంవత్సరమే రెండుసంవత్సరముల వయస్సుగల్గిన తనరెండవకొడుకును కోడలికప్పగించి తనభర్తమార్గమునే అవలంబించింది. ఆమె ఒకప్పుడు కోడలితో ఇలాఅన్నది కూడాను. "చంద్రా, 'ఇందు'ను నీచేతుల్లోపెట్టిపోతానుసుమా! మరిదైనప్పటికి వాడే నీకొడుకు. నీ హృదయము నాకుతెలుసును. అయినప్పటికీ తల్లిని గనుక ఇంతగా బ్రతిమాలుతున్నాను."

పన్నెండు సంవత్సరములవరకు చంద్రమోహిని అత్తగారిమాట జవదాటలేదు. కాని అప్పటికి భగవంతుడు ఆమెకుగూడ ఒకమొగబిడ్డను కల్గించాడు. అందుచేత మరిదైన ఇందుభూషణునిమీద ఆమె బాధ్యత కొంతతగ్గుట సహజమే. సంరక్షణలోగూడ కొంత లోటుకల్గింది. ఇంక ప్రపంచము ఇందుభూషణుని రెచ్చగొట్టింది. సందేహమనే విషవృక్షము బాగా పెరిగింది. ఇందుభూషణుడు పెరిగి పెద్దవాడై ఆస్తిలో తన వాటా పంచుకొనుటకు సంసిద్ధమయ్యాడు. కాని అతనిపేర ఏమియు వ్రాయబడలేదు. ఓర్పులేనందున అతను ఆందోళనసాగించాడు. శశిభూషణుడు కోపావేశంవల్ల తన తమ్ముణ్ణి యింటినుండి వెళ్లగొట్టి దమ్మిడీ యెత్తు ఆధారములేండా చేశాడు. ఇందుకు ప్రతిఫలముగనేమో యన్నట్లు అకస్మాత్తుగ అతను తనముద్దుబిడ్డతోసహా ఒకేసారి చంద్రమోహినిని సాంఘికమృగములమధ్య వదలివేసి ప్రపంచయాత్ర ముగించాడు. చంద్రమోహిని పిచ్చిదానివలె మతిభ్రమచెంది పుట్టింటికి వచ్చింది. ఆమె భర్త, చనిపోవుటకుముందే ఆస్తిఅంతయు తనభార్య కొడుకులపేర వ్రాసివేశాడు. ఆస్తికొరకు ఇందుభూషణుడు యెడతెగకుండా వ్యాజ్యమాడసాగేడు. చంద్రమోహినికి ఇందుభూషణుని మంత్ర తంత్ర ప్రయోగములచేతనే తనభర్త, కొడుకు అకాల మృత్యువునోటబడిరని అనుమానము వేయసాగింది. చిన్నతనములో ఇందుభూషణునికి ఆశ్రయమిచ్చిన

చంద్రమోహినియొక్క వాత్సల్యముతో నిండియుండిన మాతృహృదయము ఇప్పుడు క్రోధాగ్నిజ్వాలలతో నిండిపోయింది. ఆమె తనకొడుకునువలె పెంచిన, అతనిని ఒక బిచ్చగానివలె చేయదలంచినది. ఆమెతండ్రి ఓంప్రకాశశర్మ ఆమెతరపున కోర్టులో వ్యాజ్యమాడసాగేడు. ఆయనకు యిటువంటి వ్యాజ్యములలో చాలమక్కువ. దీనికి కారణము స్వార్థమే. ఆర్థికముగగూడ ఆయనకు బాధకల్గింది. కొడుకులలో ఒకనికిగూడ కావలసినంత ఆదాయము లభించుట లేదు. మనుష్యులసంఖ్య యెక్కువయింది. అందుచేత ఆయన సంతానములేని తనకుమార్తె చంద్రమోహిని ఆస్తిని తనకొడుకులకు సంక్రమించునట్లు చేయవలె నని తలచాడు.

ఒకరోజున చంద్రమోహిని తన తండ్రితో ఇలా అన్నదిగూడాను: "నాన్నగారూ, ఇందుభూషణుని మీద బాగా వ్యాజ్యములు వేయండి. అతనికి నా ఆస్తిలో ఏలాంటి భాగముకూడాలేదు". ఆరోజునే ఆమె వసారాలో ఒంటరిగ కూర్చొనియుండగా చిరకాల పరిచితుడైన జగదేవప్రసాదనే, చంద్ర మోహిని మామగారివద్ద పనిచేసిన ఒకపాతగుమాస్తా వచ్చాడు. ఆయన చాలా వృద్ధుడు. చిన్నతనము నుండియు ఆయన తనజమీందారుగారి కొడుకులను ప్రేమతో ఆడిస్తూవుండేవాడు. చంద్రమోహినిమీద గూడ ఆయనకు యెక్కువచనువు. కనుక ఆమె ఆయనను సత్కరించి కుర్చీమీద కూర్చొనబెట్టింది. కుశలప్రశ్నలయినతరువాత ఆయన ఆమెతో ఇలా అన్నాడు: "అమ్మాయి, నీవేమి చేయదలచినప్పటికి ఆలోచించి చేయుము. 'ఇందు'కు నీవుతప్ప దిక్కెవరులేరుకదా! అపరాధమును క్షమించుట గొప్ప ప్రతిక్రియ యను విషయము నీకు తెలుసును. అతను గూడ కొంత పౌరుషముగలవాడే."

జగదేవప్రసాదు తనదారినివెళ్లిపోయాడు. ఆయన మాటలవల్ల చంద్రమోహిని హృదయములో కొంత కలవరముకలిగింది. ఆమెతండ్రి ఇందుభూషణునిమీద క్రొత్తక్రొత్త ఉపాయములుచెప్పసాగేడు. ఆమెఅన్న గారైన మోహనుడుగూడ జగదేవప్రసాదును తిట్టి తన తండ్రితో ఆయనమీద కొండెములు చెప్పేడు. ఓంప్రకాశశర్మ కల్పించేసి అన్నాడు "ఆ దుర్మార్గుడు యెప్పుడైన మళ్లీ యిక్కడికివస్తే కాళ్లువిరగ గొట్టివేయండి. అక్కడదబ్బుతిని యిక్కడ వాదించ టానికివచ్చాడా!" తనతండ్రిమాటలన్నీ విని చంద్రమోహిని తనఅన్నతో ఇలాచెప్పింది. "అన్నయ్యా! నీవు అనవసరంగా జగదేవప్రసాదు తాతగారికి అపకారం చేస్తున్నావు. ఆయన మంచి నీతిపరుడు. సజ్జనుడు. ఆయనయెల్లప్పుడును మనమేలే కోరుతున్నాడుగదా!" ఈ మాటలు వినినవెంటనే ఓంప్రకాశశర్మ తన కూతురికి పిచ్చెక్కిందనుకున్నాడు. ఆమెకు చెరుపు చేయవలయునను కోరిక తనకులేనప్పుడు ఆమె ఈ విధముగా జగదేవప్రసాదును సమర్థించిందని కొంచము బాధపడ్డాడు.

ప్రపంచమంతయు ఇందుభూషణునికి వ్యతిరేకంగా యున్నట్లు చంద్రమోహినికితోచింది. ధనము సహాయములు లేనివాడు ఎవరినేమి చేయగలడు! ఆమె 'ఇందు' ను చూచి చాలరోజులైంది. చిన్న తనములో 'ఇందు' ఆమెను 'అమ్మా' యని పిలవటం జ్ఞాపకమొచ్చింది. అసలు ఇందుభూషణుడు ఆమెను తల్లివలె ప్రేమించేవాడు. మరొకతల్లియనువిషయం అతనికి తెలిసేదేకాదు. వెనుకటి విషయములన్నియు ఒక్కొక్కటిగా చలనచిత్రములవలె కళ్లకు కనుపించ సాగాయి. 'ఇందు' తనపెంపుడుతల్లి చంద్రమోహిని దగ్గరే నిద్రపోతుండేవాడు. జబ్బుపడినపుడు ఒక్క క్షణముగూడ తల్లినివదలేవాడుకాదు. ప్రతిమాటకు తల్లిదగ్గరకే పరుగెత్తేవాడు. చంద్రమోహినిగూడ అతనిని తనపుత్రునివలె ప్రేమించేది. తనకు పిల్లవాడు పుట్టినతరువాత ఇందుభూషణునిపట్ల నిర్లక్ష్యంగా

వుంటూయున్న సంగతి ఇప్పుడు జ్ఞాపకమొచ్చింది. నిర్లక్ష్యంగావుండుట మానవస్వభావమే. నిర్భాగ్యుడైన ఆ ఇందుభూషణుడే నిజమునకు ఆమెకొడుకు. ఆమెకుపుట్టిన పిల్లవాడు ఆమెభర్తను, ఆమె మనశ్శాంతిని నాశనంచేసి పోయాడు. ఇప్పుడే యాటంకమూలేదు. జరిగినవిషయములు ఆలోచించేకొద్దీ ఒక దుస్స్వప్నంగా తోచాయి. ఆమె హృదయములో తనముద్దులపట్టిని చూచుటకు వెంటనే పరితాపము కల్గింది. ఆమెకు ప్రియమైనవారెవ్వరు? ఆమె తనకున్నదంత యెవరికిస్తుంది? ఎడతెగని ఆలోచన తరువాత పైప్రశ్నలకు సమాధానము ఆమెహృత్పటలముమీద అంకితమైన ఇందుభూషణుని కరుణోత్పాదకమైన ఆకృతియేగదా! ఆ హృదయములో మరెవ్వరికి స్థానములేదు..

ఆమె యెవ్వరితో చెప్పక ఒకమోటారును అద్దెకు తీసికొని అత్తగారి వూరికి బయలుదేరింది. ఊరు చేరినవెంటనే వెనుకటి మాటలన్నియు పరంపరలుగ జ్ఞాపకమొచ్చాయి. 'ఇందు'కు వ్యతిరేకముగ కొనసాగించిన పనులవల్ల ఆమెకు సిగ్గు సంకోచములతో కొంత భయముగూడ కల్గింది. ఆమెహృదయములో ఒకవిధమైన ఆవేదన వుండి వుండి ప్రతిధ్వనిస్తున్నది. తల్లి, యెంతవరకు కొడుకును కష్టముల పాలుచేసి బాధపెడుతుంది! అటువంటి తల్లి తిరస్కరింపబడుతుంది. ఇందుభూషణుడు యింటిముందు ఒక మంచముమీదకూర్చొని యేదోచదువుతున్నాడు. అతనిగుడ్డలు పూర్తిగ మాసిపోయాయి. అతనిని చూచినవెంటనే చంద్రమోహినికళ్లు కన్నీళ్లతో నిండిపోయాయి. ఇతడే ఆమె ముద్దులకొడుకు ఇతనికొరకు ఆమె తనప్రాణముగూడ అర్పించగలదు. అటువంటి కొడుకును చూచినవెంటనే ఆమె కన్నీళ్లను ఆపుకోలేకపోయింది. "నాయనా, ఇందూ! నీకెంతకష్టపట్టిందిరా" యని ఆమె ఇందు భూషణునికౌగలించుకొన్నది. అతనితల తనతల్లి కన్నీళ్లతో తడపసాగింది. అతను మొదట విస్మితుడయ్యాడు. తరువాత అతని కళ్లుగూడ ప్రేమాశ్రువులతో నిండిపోయాయి. ఈ పరివర్తనమంతయు మాతృహృదయప్రభావమే.

అనువాదకర్త్రి:రామచంద్రునిఅన్నపూర్ణాదేవి. రచయిత:-శ్రీ నిశితకుమార్‌రాయ్.B. A.

హిందీపత్రిక 'దీదీ' నుండి—

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి

## నెల్లూరి నాటక సమాజములు.



### నెల్లూరి వర్ధమాన సమాజము

నాకు తెలిసినప్పటినుండియు ఈ సమాజమునకు (దీనిని తెలుగులో నెల్లూరు వర్ధమానసమాజము అని 1906 నుండి పిలిచేవారు.) ముఖ్యపురుషులు శ్రీమాన్ కే. ఏ. వీరరాఘవాచార్యులుగారు. ఈ సమాజమునకు వీరు తండ్రివలె నుండేవారు. వీరుజీవించి యున్నంతకాలము సమాజమున నాటకములశాఖ జీవముతోనుండెను. అప్పు డీ సమాజపు నాటకములశాఖ నలంకరించుచుండినవారిలో శ్రీ కాసుఖేల కపాలి రామచంద్రరావుగారు, వరదాచారిగారు, ముంగమూరి వెంకటసుబ్బారావుగారు, నందగిరి హనుమంతరావుగారు, రామానుజాచారిగారు, వవ్వేటి విశ్వనాథరావుగారు, సింగరాచార్యులుగారు, ముత్తరాజు శివకామయ్యగారు మున్నగువారు నాకు బాగుగ జ్ఞాపకమున్నవారు.

వీరందరు ఉద్యోగస్థులు; పెద్దమనుష్యులు. చక్కని నటులు. అయితే నాటకములు వేయవలెననే కుతూహలమున్నంతగా అందుకు తయారుకావలయుననే శ్రద్ధ యుండెడికాదు. వీరికి ఆంధ్రభాషాభిమాని సమాజమునకువలె గురుత్వముతో శిక్షించి ఒద్దికల దిద్దగల వేంకటరాయశాస్త్రిగారివంటి ప్రతిభాశాలురు లేరు. అట్టి శిక్షణ మిచ్చగింపక సమాజమునకే ముప్పుదెచ్చుకొన్న అమెచ్యూర్సు నాటకసంఘమువారును వీరిలో కొందరున్నారు. పోనీ వీరిలో వీరైన నొకరికొకరు శిక్షణనిచ్చుటలేదు. వీరందరును పెద్దలగుటచే అది నాజూకుకాదని వీరిఅభిప్రాయము. అందుచే సామాన్యముగా వీరు నాటకమెప్పుడువేసినను, ఎవరును, తమ పార్టునైనను పూర్తిగా చదివి కంఠస్థము చేసుకొనేవారు కారు. కేవలము తెరవెనుకనుండి అందిచ్చు (Prompter) సాహాయ్యముననే నాటకము సాగించేవారు. ఒకొక్కప్పుడు కొన్నిచిత్రములును జరుగుచుండేవి. తెరవెనుకనుండి చెప్పువానిమాటలు—ముందుకుర్చీలపై కూర్చున్నవారికి తరచుగా వినిపించుచుండేవి.

చిత్రనళీయములో దమయంతిని నలుడు విడిచివెళ్ళినతర్వాత ఆమెఅడవిలోపోవు చుండగా నొక ఋష్యాశ్రమము కన్పించును. అందున్నఋషులలో నొక్కరు ఆమె కథ నంతావిని సానుతాపమున నొకపద్యము చదువును.

"హరి హరీ (అని చెవులు మూసుకొని)........"

ఇందు "చెవులుమూసుకొని" అనునది పాత్రధారికి సూచన; ఇది నటించవలసినదే గాని వచింపవలసినదికాదు. అయితే ఈ వేషమువేసిన మా మిత్రులు కీ. శే. నేలటూరి శింగరాచార్యులుగారు (వీరు వెంకటగిరిరాజాగారి హైస్కూలులో పైతరగతుల కుపాధ్యాయులు)—"హరి హరీ" తోపాటు ఆ "చెవులుమూసుకొని" అనేదికూడ తెరవెనుకనుండి అందుకొని—పద్యములో కలిపివేసి రాగయుక్తముగా చదివివైచిరట. ఆ నాటకము నెన్నోసార్లు చదివిన చూచిన, ప్రేక్షకులు—చప్పట్లుచరిచి గల్లంతుచేసిరట.

శ్రీ నందగిరి హనుమంతరావుగా రొక్కసారి ప్రమీలార్జునీయమున ప్రమీలాపాత్రను నటించిరి. వేషమున పెద్దపావడా ధరించిరి. ఆ పావడా సింహాసనమునంతయు కప్పియున్నందున దానిక్రిందచేరి యొకడు 'పార్టు' నందించుచుండెను. కాని ఎంత కాలము ఆత డట్లు కూర్చుండగలడు? ఆ రంగమున చెప్పవలసినదంతయు కాగానే తెరపడువరకు ఓపిక పట్టజాలక అతడు ఇవతలికివచ్చి లోనికిపారిపోయినాడు. సభాసదులందరును గొల్లున నవ్విరి.

అయితే వీరివేషభాషలు తక్కువైనవికావు. ఇప్పుడు రామచంద్రరావుగారిని చూచిన వారికి ఆశ్చర్యము గొల్పవచ్చును. ఆ రోజులలో వారి రాజవేషము రాజఠీవితో నొప్పెడిది. ఆ మూర్తి నా కింకను కళ్లలోమెదులుచున్నది. శ్రీ నందగిరి హనుమంతరావు గారు స్త్రీవేషమున 'స్త్రీయేనా' అని భ్రమింపజేసేవారు. ఇరువురు చక్కగా పాడనేర్చిన వారు. అయితే ఉన్నలోపము పైన వివరించేయున్నాను. రానురాను వీరు నాటకము లాడుట మందగించినది. కాని దసరాఉత్సవములలో—లఘు ప్రదర్శనములు, ప్రహసనములుమాత్రము వేయుచుండిరి. అందు ముఖ్యముగా నాటకములకు సంబంధించినంత వరకు 'టాబ్లో' (Tableau) అనే పాశ్చాత్యపద్ధతి ననుసరించి ఒక్కొక్కఘట్టమును ప్రదర్శించేవారు. అనగా ఆ ఘట్టమున కవసరమైన—(విశ్వామిత్రునకు హరిశ్చంద్రుడు రాజ్యమునొసంగుట, దమయంతిని నలుడువిడిచిచనుట, ఇత్యాదులు)వేషములధరించుకొని ఆ యా అభినయమున కదలకమెదలక రంగమున నిల్చియుండేవారు. అందు కనుగుణ్యమైన పద్యమో, పాటయో. తెరలోనుండి యొకడు శ్రావ్యముగ విన్పించేవాడు. నటులకు వెనుక రంగులసీను; ముందు దోమతెరవంటి కర్టన్. అనుగుణ్యమైన దీపములయేర్పాటు.

ఎంతో రమ్యముగనుండెడిది. అందు సహజముగా సుందరవిగ్రహములుగల పీనటులు, తగువేషములు వేసుకొన్నప్పుడు ఎంతో ఒప్పియుండేవారు.

వర్ధమానసమాజమువారు నాటకములువేయురాత్రి నేను మద్రాసునుండి వారికి కావలసినవస్తువులను తీసుకొనిపోవుచుండేవాడను. నాటికినేటికి నే నీసమాజమున సభ్యుడనే. అయితే నా కారువారైన నామిత్రులు చాలమంది గతించినారు. కావున ప్రత్యక్ష సంపర్కము చాలవరకు మందగించినది.

ఈ సమాజమువారు తిక్కన పఠనమందిరము నొకటిని, పుస్తకభాండారము నొకటిని నడుపుచున్నారని ఇదివరకే వ్రాసియున్నాను. దానిలోనే యొకశాఖను కీ. శే. వేదము వేంకట్రాయశాస్త్రిగారిపేర నొక గ్రంథాలయముగ నేర్పరచియున్నారు. ఈ సమాజముతరఫున చిరకాలమునుండి ఏటేటా తిక్కన జయంత్యుత్సవమును చాలవైభవముగ జరుపుచున్నారు. ఇటీవల కొన్నాళ్లుగా శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారీ యుత్సవ నిర్వహణభారమువహించి—ఆంధ్రదేశమందలి విద్వత్కవులను ధనరూపమున సత్కరించుచు—ఆంధ్రకవితాదేవి నారాధించుచున్నారు. వీరే శ్రీ వేదము వేంకట్రాయ శాస్త్రిగారి వర్ధంతియు ఏటేటా జరుపుచున్నారు. నేను ఈ సమాజపక్షముననే నెల్లూరున మొల్లజయంతుల జరిపించి—ఆ సందర్భముననే, గృహలక్ష్మీస్వర్ణకంకణ ప్రదానము నారంభించితిని. వ్యాసరచనపోటీ పతకముల నిచ్చియుంటిని. పిదప నిచ్చట చెన్నపురిలో మా యింటనే ఆ యుత్సవముల గావించుచున్నాను.

## ఆంధ్ర భాషాభిమాని సమాజము.

వర్ధమానసమాజమును గూర్చి వ్రాయుచు దాని తొల్లింటిరూపము 'అమెచ్యూర్స్ నాటకసంఘము' అనియు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు 1897 లో వ్రాసిన ప్రతాపరుద్రీయనాటకము నొకసారి ప్రదర్శించి విఫలులై, తిరిగీ స్వతంత్రముగా తర్ఫీదై ప్రదర్శింతమా, శాస్త్రిగారిచే తర్ఫీదై ప్రదర్శింతమా అన్న వాదవివాదములతో, ఆ సమాజమున చీలికలేర్పడి, శాస్త్రిగారి శిష్యత్వముకోరినవారు వేరై—'ఆంధ్రభాషాభిమాని సమాజము'గా నేర్పడిరి—అని వ్రాసియున్నాను.

శ్రీ శాస్త్రిగారి తర్ఫీదును కొందరు కోరుటలో అర్థములేకపోలేదు. శ్రీ శాస్త్రిగారు గొప్పపండితులు, కవులునేగాక గొప్ప ఉపాధ్యాయులు. ఆంగ్లనాటకముల సాంప్రదాయముల నెరింగినవారు. కావున రంగస్థల, నిర్వహణమర్మములన్నియు తెలిసినవారు. ఆయన క్రిస్టియన్ కాలేజీలో సంస్కృతాధ్యాపకులుగా చేరినపిదప ప్రతిసంవత్సరమును ఏదేనొక్క సంస్కృతనాటకమును వారికి బోధింపవలసియుండెను.

ఆ బోధించుటతో వీరు తృప్తిపడక, తమశిష్యులలో చురుకైనవారి నేరి వారివారికి తగిన పాత్రలనొసంగి నాటకమును నేర్పేవారు. భవభూతికృత 'ఉత్తరరామచరితము' అను నాటకము, కేవలము చదివి ఆనందించవలసినదేగాని ఆడి, చూడదగినదికాదని పలువురి అభిప్రాయము. అందుచే ఎల్లరు దానివంకచూడక వదలివేసిరి. అట్టిదాని నొకసారి శ్రీ శాస్త్రిలవారు తమశిష్యులకు నేర్పి ప్రదర్శింపించి అందరిచే మెప్పుబడసిరి. నెల్లూరు చెన్నపట్నమునకు సమీపమగుటచేతను, అప్పటికి నెల్లూరున కాలేజిలేకపోవుట చేతను నెల్లూరి విద్యార్థులు ఎఫ్. ఏ, బి. ఏలు చదువుటకు మద్రాసువచ్చుచుండిరి. శ్రీ శాస్త్రిలవారు క్రిస్టియన్ కాలేజీలోచేరిన సంవత్సరమే వారివద్ద చదివినవారిలో శ్రీ వంగోలు వెంకటరంగయ్యగారు ఒకరు. ఇంకను యరగుడిపాటి వెంకటచలంపంతులు, మైదవోలు చంగయ్యపంతులు, కందాడై శ్రీనివాసన్, మొదలైనవారంతా వారివద్ద చదివినవారే. ఆయా కారణములచే శ్రీ శాస్త్రిగారివద్ద తర్ఫీదై—దుర్ఘటమైన ఈనాటక మాడి మెప్పింపవలయునని కొందరు నెల్లూరి యువకులకు పట్టుదలకలుగుటలో ఆశ్చర్యములేదు. ఈ చీలికలు, కోరికలు గమనించిన పూండ్లరామ కృష్ణయ్యగారి ప్రోత్సహమున 30-4-1889 తేదిన "ఆంధ్రభాషాభిమాని సమాజము" 13 గురితో నేర్పాటైనది.

దీనికి శ్రీ శాస్త్రిగారే శాశ్వతాధ్యక్షులు. శాస్త్రిలవారినాటకములు తప్ప ఇతర నాటకములాడరాదు; శాస్త్రిలవారివద్ద శిక్షణపొంది వారి అనుమతిపైగాని నాటకము వేయరాదు—అని నియమము లేర్పచుకొనిరి.

అమెచ్యూర్సులో కలిగిన చీలికలు కొంతవరకు నెల్లూరిలో అశాంతికల్గించెనన వచ్చును. అంతవరకు కలిసిమెలిసియున్న మిత్రులు, బంధువులు విడిబడి చెరియొక సమాజమునకు చెందిరి. శ్రీ కేశవాచార్యులు, శ్రీనివాసన్ గార్లు సోదరులు; ఇరువురు బి. ఏ. లు. ఇరువురు అమెచ్యూర్సునందుండిరి. అన్న అందేనిల్చిపోయెను; తమ్ముడు ఆంధ్ర భాషాభిమాని సమాజమునచేరెను. క్రమముగ అమెచ్యూర్సునందు హేళనభావమును, ఆంధ్రభాషాభిమాని సమాజమున అభిమానమును హెచ్చసాగినవి. అసలువారిలో కన్నను వారివారియందు అభిమాన దురభిమానములు గలవారిలో తగవులు హెచ్చు. బహుశా ఈ తగవులఫలితమేమో 1906లో అమెచ్యూర్సువారి నాటకపుకొంపాయి తగులబడి పోవుటకు కారణము? ఈ నాటకపు పాకలుతగులబడుట నెల్లూరుననేకాదు. ఆ రోజులలో-బళ్లారిలో లోను సరసవినోదినీ సభవారిపాకయు తగులబడిపోయినది. రాజమహేంద్రవరమున శ్రీ కృత్తివెంటి నాగేశ్వరరావుగారి పాకయు తగులబడిపోయినది. ఈ రోజులలో ఎలక్షన్లవలె ఆ రోజులలో నాటకసమాజములు కక్షలకు, తగవులకు ప్రధానరంగములు.

శ్రీ శాస్త్రిలవారి యాజమాన్యమున ఆంధ్రభాషాభిమాని సమాజము దినదిన ప్రవర్ధమానమై చిరకాలము నడచినది. 1925 లో రత్నావళీనాటకముతో సరిమరి నాటకము వేయ లేదు.

శాస్త్రిలవారు శిక్షించుటలో చండశాసనులు. ఒక్కవాక్యము మరువరాదు; ఒకమాట పొల్లుపోరాదు; అభినయమున నొక్కపొరపాటు రారాదు. ఒక్కసారి నటి— ఉషలో నొకపద్యభాగమును విడువగా నారోజున నాటకము నాపుచేయుటకే ప్రయత్నించిరట. ఖైదుచేయుబడి విరహావస్థలోనున్న అనిరుద్ధునిరొమ్ముపై వ్రాలునట్లుగా 'ఉషను' చిలుకనుగావించి, చిత్రలేఖ విసరుట కథపట్టు. కాకితపు చిలుకనైనను జాగ్రత్తగా అనిరుద్ధుని రొమ్ముపై బడునట్లే విసరగల్గుట శాస్త్రిగారి శిక్షణప్రభావమే. ప్రతాపరుద్రీయములో పిచ్చివానికెన్నో పిచ్చిపాటలున్నవి. వానిలో అర్థరహితమైనను ఒక్కఅక్షరమును—"గ్యం బ్యం గ్యం బ్యం గ్యం బ్యా...." అను దానిలో సహా వదలరాదు. విద్యావంతుడుగాకున్నను, చక్కని శరీరము, శారీరముగల మధ్వరాయుని విద్యానాథునిగా తీర్చిదిద్దిన వారి ప్రతిభ అద్భుతము. కొండగుంట వేంకటరమణశాస్త్రిగారిని పేరిగాని వేసానికి తయారుగావించుటయు వారి శక్తిసామర్థ్యముల ఫలమే. రాజఠీవికి విన్నికగన్న 'దొరసామి'కి మొదటిరోజులలో యాదాలాపమున తలమోరగిలపెట్టుట. అలవాటు. అది రాజవేషమునకు లోటు; దాని నెన్నివిధములనో చెప్పిమాన్పించిరి. కాని ఏ ఏమరిపాటుననో ఎప్పుడోయొకప్పుడు రంగస్థలమున నది ప్రదర్శింపబడుచుండెనట. అంత నొకసారి— "బెత్తముతీసికొని ప్రక్కతెరలో నిల్చియుందును; తల మోరగిలపెట్టితివా రంగస్థలమునకే వచ్చి బెత్తముతో బాదెదను. జాగ్రత్త!" అనిశాస్త్రి బెదరించెనట; అట్లే బెత్తముపట్టి నిల్చియుండెనటకూడ. ఆ బెదురుతో అత డాసారికి ఆ పనిచేయలేదు; పిదపకూడా ఆ పనిచేసియుండలేదు.

ఈ సమాజము నటులలో చాలవరకు శ్రీ శాస్త్రిగారివద్ద చదివినవారు అని పైన చెప్పియుంటిని. అందుచే చిరపరిచితులు. వారి నైజవేషభాషలు శాస్త్రిగారికి బాగుగా నెరుకయే. కావున తమ నాటకములందాయాపాత్రల చిత్రించునపుడు అందుకైననటుల నిర్ణయించుకొని వారి నైజములకొన్నిటి నాపాత్రలకు ఔచిత్యభంగమురాకుండ, హత్తించేవారు. లోపాలోపములన్నియు తీర్చిదిద్ది తాము స్వయముగా తర్ఫీదునిచ్చేవారు. అందుచే ఆ యానటులు తాము నటించుపాత్రలతో తాదాత్మ్యము చెందేవారు. బాణాసురునిపాత్ర—శ్రీ యరగుడిపాటి గోపాలకృష్ణయ్యగారికై ఏర్పాటైనది. ఆయన వరదయ్యపంతులుగారికి రెండవకుమారులు. ఇంట్లో ఎంతో అట్టహాసము చేస్తుండేవారుట. ఆ అట్టహాసము,' ఆ అపహాస్యము, ఆ వికటహాసము, ఆ కోపము, ఆ పండ్లుకొరుకుట, మున్నగున వన్నియు ప్రథమ ప్రదర్శనమున రంగమందు తన చిన్నకొడుకు—ఇంట

చేయునట్లే చేసిచూపగా—మరునాడు శాస్త్రులవారివద్దకు వరదయ్య పంతులుగారువచ్చి "మా వానికితగిన వేషమిచ్చినావయ్యా!" అని తన సంతోషాశ్చర్యముల తెల్పిరట. గోపాల కృష్ణయ్యగారు రంగస్థలమును త్వరగానే విడిచిపెట్టిరి. వారి అన్నగారు వెంకటచలం పంతులుగారు మాత్రం మరి కొంతకాలము వేసములు వేశేవారు. తమ్ముని తర్వాత అన్నగా రీవేసమువేసి ఒప్పించేవారు. ఆ గోపాల కృష్ణయ్యగారి కుమారులే నేడు సినిమారంగమున ప్రఖ్యాతి వహించిన వై. వి. రావుగారు (యరగూడి పాటి వరదరావుగారు). నేను స్వయముగా చూచిన కొందరు నటులనుగూర్చి ఇక్కడ ప్రస్తావన చేయుదును.

దొరసామి

ఈయనపేరు కందాడై శ్రీనివాసన్. ఈయన ఆంగ్లమున బి. ఏ. యల్. టి. కొన్నాళ్లు పచ్చయప్ప హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగానుండిరి. పిదప నెల్లూరిలో వెంకటగిరి రాజాగారి హైస్కూలునం దుపాధ్యాయులుగానుండిరి. సంస్కృతమున పండితులు. సంగీతశాస్త్రవిశారదులు. భరతశాస్త్రనిధులు. మంచిశారీరము; సుందరమైన గంభీరవిగ్రహము. రాజఠీవి ఉట్టిపడుతుండేది. రాజవేషమున కాయనను చెప్పి మరి ఇంకొకరిని చెప్పవలయును. దుష్యంతుడుగా తుమ్మెదచే బాధపడుచున్న శకుంతల ఆర్తిని విని - 'ఎవడురవాడు?' అని ముందుకు దుముకునప్పుడు, ప్రతాపరుద్రుడుగా - 'మేము రాము' అని తురకసిపాయిలతో నిరాకరించి పలుకునప్పుడు, ఉష శయ్యాగారమున అనిరుద్ధుడుగా బాణాసురినితో నిర్లక్ష్యమున 'నీ అల్లుడను' అని చెప్పి - లాఘవమున లేచి అతనితో కలియబడునప్పుడు - ఆ ఠొంకము చూడదగినదే గాని వర్ణింపతరముగాదు. "వీరి దుష్యంతపాత్రచూచి జటప్రోలు ప్రభువులు, 'రాజంటే వాడేరాజురా, మిగిలిన రాజులేమిరాజులు తరాజులు' అని వచించి"రట? సంస్కృతపండితుడగుటచే - కఠినపద భూయిష్టమైన శ్రీ శాస్త్రులవారి పద్యములనాయన చక్కగా విడదీసి అర్థభావము లుట్టిపడ తగు అభినయమొనర్చుచు - పరిమితమైన సంగీతముతో చదివినప్పుడు అరటిపండువలిచి చేతిలోపెట్టినట్లుండెడిది. వేషధారణమున ఏయే యుడుపులు ఏపాత్రలకు వలయుననుటయే గాక, ఏయే రంగములనేయేయవి రాణించునో యనికూడ వారికి శాస్త్రవతుగా తెలియును అని అందురు. వారియందు శాస్త్రిగారికి కడువాత్సల్యము. వారికిని అట్టి భక్తివిశ్వాస ములు గురువుగారియందు. అయిననేమి? వారి స్వతంత్రప్రకృతి సాటి సభ్యులకు కొందరికి వెక్కసమై ఏదో సాకుపెట్టి నిరసించగా - వారాసమాజమునుండి చాలించుకొనిరి. వారు చాలించుకొనుటతో ఆ సమాజమునకు క్షీణదశ ప్రారంభమైనది. శ్రీ శాస్త్రులవారు వారికై, రంగారావు, అగ్నిమిత్రుడు, పురూరవుడు - పాత్రల నూహించి రచించిన,

బొబ్బిలి నాటకము, తెనిగించిన మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ నాటకములు-వారులేకయే సమాజమువారు ప్రదర్శించిరి. బొబ్బిలి సెట్లో నిర్వహింపగల్గిరిగాని మిగత రెంటికి శాకుంతలమునకు వచ్చినపేరు తేలేకపోయిరి.

దొరసామియు నంతటితో నాటకరంగస్థలము వీడక స్వంతముగా నొక నాటక సంఘమేర్పరచి తాముగా కల్పించిన హరిశ్చంద్రనాటకము, కృష్ణలీలలు, బళ్లారివారి ప్రహ్లాద, శ్రీ జయపురం మహారాజా విక్రమదేవవర్మగారి శ్రీనివాసకళ్యాణము ఇత్యాది నాటకములను కొన్నిటినాడిరి. అందువరుసగా హరిశ్చంద్ర, యశోద, హిరణ్యకశ్యప, శ్రీనివాసాదిపాత్రలధరించేవారు. యశోదపాత్రధరించి విక్టోరియారాణివలె నుండెడివారట. వీరు పిదపకాలమునందు సహాయనిరాకరణోద్యమమున ప్రవేశించి, కారాగార వాసమనుభవించి జబ్బుపడిరి. శాస్త్రిగారికిని వీరికిని పరస్పరానురాగభక్తితాత్పర్యములు నశించలేదుగావున - జైలునుండి వచ్చిన యనంతరము ఉభయులు తిరిగీకలుసుకొనజొచ్చిరి. అప్పుడు రోగగ్రస్తుడైన తాను చిరకాలముజీవింపజాలననియు, తిరిగీ తమ సమాజమున చేరి, దుష్యంత ప్రతాపరుద్ర పాత్రలను కడసారిధరించి గతింపవలెనని తన అభిలాష యనియు దొరసామి ప్రార్థించగా శిష్యవత్సలులగు శ్రీ శాస్త్రిగారు వారికా అవకాశ మిచ్చిరి. ఈయన అసలుపేరు శ్రీనివాసర్ అయినను శ్రీ శాస్త్రిగారు అతనియం దభిమానమున 'దొరసామి'యని పేరిడిరి. పిదప కొంతకాలమునకు కీర్తిశేషులైరి. అయినను వారిని రంగస్థలమున వివిధపాత్రల నటించగాచూచిన మావంటివారికి ఊహించినంతనే కన్నులయెదుట కన్పించుచుందురు.

రంగసామి

ముమ్మడమ్మ వేషము మొదలు యుగంధరుని వేషమువరకు అన్ని వేషములు వేసినారు. ముఖ్యముగా స్త్రీపాత్రలను మొదట ధరించుచుండేవారు. శాకుంతల, మల్లమదేవి, చిత్రరేఖ - మున్నగు వేషములను ధరించేవారు. శకుంతల వేషమున ఆరణ్యకుల అమాయకత్వము, యావనప్రాయపు ముగ్ధతనము, భర్తృ తిరస్కృతయై, 'అనార్యా' అని అతని నిందించునప్పటి రోషావేశము - కణ్వశిష్యులు రాజాస్థానమున నీ కర్మమని విడిచిపోవునప్పుడు దుఃఖాతిశయమున ఏమితోచమి పరవళ్లు త్రొక్కుచుపడు చిడిముడిపాటు - మారీచాశ్రమమున భర్తృపునస్సమాగమమున గాంభీర్యముద్ర, - వీనినన్నిటిని-అసదృశముగా నటించేవారు. ఒడ్డుపొడుగుగల-దొరసామిరంగసాములు, దంపతులపాత్రల వహించి రంగస్థలమున కందమిచ్చేవారు. మల్లమదేవిపాత్రధరించినప్పుడు-వెలమ యువతు లిట్లుందురుకాబోలు అనిపించువారు. శ్రీ శాస్త్రిగారు కాళిదాసువలెనే ముఖ్య స్త్రీ పాత్రలకు ఒకటి రెండుకంటె ఎక్కువ పద్యములుంచరు. మల్లమదేవికల్లో-బాలుని రాణి

బాపనవేసమున బయటకంపు కరుణోత్తర సంవిధానమున - రెండు పద్యములు వ్రాసినారు. ఆ పద్యములనాయన - ఏ మాత్రమును సంగీతముంచకయే, తగిన (కంఠ) స్వరవిన్యాసమున చదివినప్పుడు ప్రేక్షకులలో కంటతడి పెట్టని స్త్రీపురుషులుండేవారు కాదనిన అతిశయోక్తి కాదు. వీరు పిదప పురుష వేషములనుకూడ-ప్రతాపరుద్రుడు, పుష్పహారవుడు మున్నగు వేషములనుకూడ, ధరించేవారట. వారే నేడు సినిమాలలో ముసలిమగడుగానో, ముఖ్య నాయిక ముదుసలి తండ్రిగానో - నటించు రంగసామిగారు.

### యరగుడిపాటి వెంకటచలంపంతులు

నెల్లూరిలో ఆ రోజులలో పేరుచెప్పకుండా ఊరక 'పంతులు' అంటే వీరికే అన్వయంఅయ్యేది. నెల్లూరి రంగనాయకుల గాలిగోపురం కట్టించినది వీరి తాత వెంకటచలం పంతులుగారు. పంతులుగారు మంచి దర్పంగలవారు. ఆ జానుబాహువులు; ఒడ్డుపొడుగు; స్ఫురద్రూపులు. పాతకాలపు పల్లెటూరి నియోగిపంతుళ్ల అట్టహాసమంతయు వారియందు మూర్తీభవించియుండేది. ఎవ్వరినైన 'ఒరే' అను చనువు వహించేవారు. బహుశా వారు భక్తిభావమున శాస్త్రిగారిని, స్నేహమున చెంగయ్యపంతులుగారిని మాత్రము మన్ననతో పిల్చేవారు! ఏ సభలో కూర్చున్నా 'సభాపతి' పదవి వహించవలసినదే. అనగా సభాసదులు ఏలాటి శబ్దముచేయకుండ 'సద్దు, సద్దు' అని అదలించుట మొదలు—సభానిర్వాహకులకు కార్యక్రమము నాజ్ఞాపించువరకు—నియంతృత్వము వారిదే. ఆయనకు మంచి సంగీతజ్ఞానము కలదుగాని, పాడుటకు నేర్పు చాలదు. అయినను పద్యములు పాడవలయుననే అభిలాషమెండు. పట్టిపట్టిచదివేవారు. అయితే అభినయమందు దిట్టలు; పైనశాస్త్రిగారి శిక్షణ. శాకుంతలమందు కణ్వశిష్యుడు, ప్రతాపరుద్రీయమున చెకుముకి, ఢిల్లీసుల్తాన్, ఉషలో బాణాసురుడు, నాగానందమున శంఖచూడుని తండ్రి;— ఇత్యాదివేషములు వేసేవారు. బాణాసురుడుగా—ఒక్క—శివునితప్ప లోకమంతయు జయించితినన్న,—అహంకారము, ఇంద్రాదులును తన్నుగొల్చుచున్నారన్న దర్పము, శివునివల్ల వరములుబడసితినన్న నిర్లక్ష్యభావము ప్రదర్శించు బాణాసురపాత్ర స్వతంత్రభావులైనపంతులుకు ఒప్పియుండేది. వయసుమిగిలిన తర్వాతకూడ ఆయన వేషధారిగా చూపిన లాఘవము అద్భుతము. అనిరుద్ధునితో యుద్ధముచేయుటగా కత్తిసాము చూపెడివారు. బాగుగా దేశీయ కసరత్తు నేర్చినవారు. అయితే వారి సామ్మైనది, ఢిల్లీసుల్తాన్ వేషము. ఆ డాబు, ఆదర్పము, ఆ దౌలత్ వారే చూపవలయును; తమకు తెలియకయే, అర్ధరాత్రమున వర్తకులసరుకుల యోడలో బందీకృతులై—వరంగల్ కు తరలిపోవుచున్న సీను—అర్ధరాత్రమునకు తటస్థించును. ఆ సన్నివేశము గంభీరమును విషాదకరమునైనది. ఆతని వజీరులందరు పరస్పర జయకాంక్షులై ఒకరిగొంతు లొకరుకోసుకొనుటకు సంసిద్ధులైయుందురు. అందరు తప్పత్రాగుదురు. వారందరికి కుదురు తాను. కాని ఏమియు నెరుంగడు. అప్పుడు వారు ప్రదర్శించు 'భరువసా' వేరెవ్వరు ప్రదర్శింపజాలరనవచ్చును.

(సశేషము)




తంజావూరు నగర్ల అంతఃపురాంగనలు తమ అందచందాలను పరిమళము గుబాళించు విలువైన అంగరాగములను విరివిగా నుపయోగించి కాపాడుకొనేవారు.

నేటి భారతీయ స్త్రీకి అందానికవసరమైన, అంతకన్నా సులభమైన మంచి మార్గం తెలుసు. ఆమె కేరళ విల్లింగ్డన్ సబ్బు వాడుచున్నది.

# KERALA
## Willingdon Soap

A MADRAS GOVERNMENT PRODUCT




## KERALA SOAP INSTITUTE, CALICUT.
( Department of Industries & Commerce )




నేరేడు:—ఈచెట్లు సర్వసామాన్యముగా అంతటనుకనుపించును. మరియు రోడ్లవరుసన, పాఠశాల ఆవరణములలోను, దేవాలయఆవరణములలోను వేసి పెంచుదురు. త్వరగా వృద్ధికిరాగలవృక్షము. దీనిపండ్లు పక్షులకు, పిల్లలకు, వైద్యములకు పలు విధములుగ నుపయోగపడును. తినిన ఆకలితీరును. ఔషధరూపమున వ్యాధులు కుదుర్చును. మేహనివారిణి. మధుమేహములయందు అతిదాహము సామాన్యముగనుండును. అట్టివారు లభించినఫలములు తినవచ్చును. లేదా ఎండబెట్టిన నేరేడువిత్తులు దుకాణములయందు విక్రయించబడును. చూచి కొనుట మంచిది. త్వరగ పురుగుచేరునట్టి స్వభావముకలది. దీనినెరుగనివారుండరు. ఉపయోగ విధానము తెలుసుకొన్న చాలమంచిది. మధుమేహ రోగములకు కాఫిపౌడరుకు బదులు దీని విత్తనముల చూర్ణము 1 తులము, తంగేడువిత్తుల చూర్ణము 1 తులము, కరక్కాయల చూర్ణము 1 తులముచేర్చి తడవకు 1 తులము మసలెడు నీళ్లలో వేసి కాచి మరిగినతర్వాత దింపి చల్లారనిచ్చి త్రాగిన మంచి గుణమిచ్చును.

మరియు లోమలలుకలవారికి తగినమందు.

బెరడు, ఆకులుకూడ ఉపయోగపడును. బెరడుతో కషాయములు యథావిధిగ తయారొనర్చుకొని పూటకు 1 ఔన్సుచొప్పున తీసుకున్న మధుమేహములు తగ్గును.

ఆకులు నూరి పగులని గడ్డలపైవేసి కట్టిన చురుకులు పోట్లు తగ్గి త్వరలోపగిలి నెమ్మదించును.

పండిన పండ్లయొక్క రసముగాని, పండ్లతో తయారొనర్చబడిన పానకమునుగాని సేవించిన కడుపుబిగబట్టుట శాంతించును. ప్రేగుల ఉబ్బును సడలించును. మూత్రమును జారిచేయును. పండ్లయొక్క రంగు ప్రశంసనీయము. ఆరోగ్యప్రదమైనది. పండ్లను తినుటవల్ల నాలుకపగులుట నోరుపూయుటమానును. కడుపులో జీర్ణకోశసంబంధమయిన పుండ్ల (Ulcers)కు గుర్తెరిగి వాడినమంచిగుణమిచ్చును. ప్రకృతిమనకు యెల్లప్పుడు మాతృభావమునే చూపుచున్నది. ఈఋతువునందుకల్గు విరేచనములు, నీళ్లవిరేచనములు

మున్నగునవి అంకురించిన సమయముననే ఔషధంసిద్ధం అనునట్లు యీపండ్లు కాయ ప్రారంభించును. ఇట్టివి పరిశోధించి, పరిశీలించివాడి గుణములు గ్రహించిన గృహవైద్యము అవలీలగ పట్టుబడును.

చక్రవర్తికూర:—ఈ కూరయందుగల ప్రాముఖ్యత ప్రజలను చక్రవర్తి పాలించినట్లే, రోగములురాకుండ మనలను కాపాడుట. ఈ ఋతువునందు విస్తారముగ దొరికిననూ విరివిగ అందరికి వాడుటకు తెలియదు. మేహశాంతి; ఆకలితీర్చును; నంజును రానివ్వదు. విషములకు విరుగుడు. కర్పూరపువాసన కొంచెము కల్గియుండునుగాన హితకరమైయుండును. ఉన్మాదము, అపస్మారము, మెదడువేడెక్కుట, వంటి తలనొప్పిగల వారలకు మంచి ఉపయోగము. గుండెకు బలమిచ్చును.

ఇగురు కూరలు, పొడికూరలు, పప్పుకూరలు, పులుసుకూరలమాదిరిగనే వండవచ్చును.





గతమాసమున, మొక్కజొన్నను గూర్చి వ్రాసియుంటిమి. జొన్న, సజ్జ రాగి (తమిద) కన్న బియ్యము విస్తారముగ వాడబడుచున్నదిగాన దానినిగూర్చి వివరింతుము. ధాన్యములు అనేకరకములున్నవి. అయా వానికి ప్రత్యేకగుణములుగలవు. అన్నిటిలోనికి శ్రేష్ఠమైనవి నెల్లూరి పిషాణీ లనవచ్చును. నదీజలమువల్ల పండుధాన్యముకన్నను—చెరువుక్రిందిపంట శ్రేష్ఠతరము.

అసలే బియ్యము గోధుమకన్న తక్కువబలకరమైనది. ఇతరపదార్థముల చేరికచేత ఆహారమునకు పూర్ణత్వ మొసంగవలసియున్నది. అయితే ఇప్పుడు మరబియ్యము విస్తారమైనందున దంపుడు బియ్యములో నుండుకొన్న జీవపదార్థములుతొలిగి మరియు బలహీనకరమైన ఆహారమగుచున్నది. అందుచే లోపించిన పదార్థము పూరించుటయో, దంపుడుబియ్యమునే సేకరించుటో చేయనిచో అనారోగ్యమునకు మూలమగుచున్నది.

బియ్యము వంటిపట్టు మరబియ్యము - దంపుడుబియ్యము, చేబియ్యం - ఉప్పుడుబియ్యము అని యింకా యెన్నోరకాలు.

మరబియ్యమునకు ఫ్యాక్టరీవారు మెఱుగువేయుదురు. కేసరివడ్లు (మోసనము) బియ్యం-స్వాభావికముయినరంగే. మిక్కిలి రుచిగనుండును.

ఫ్యాక్టరీవారు వేయు రంగుబియ్యము నంటియుండుటవల్ల గంజిరాదు. గంజిలోని పదార్థము ఆరోగ్యమునకు దూరము. తవుడును మరుగుపరచు మాయదారిరంగు పూసుకొని యుండుటవల్ల గంజి రానేరదు. గనుకనే తరుచు అజీర్ణము, మలబద్ధకము. పక్షవాతలక్షణములు. రక్తపుపోటు, నీరసము. నిస్త్రాణ, మొదలయిన జబ్బులకన్నిటికి గురియగుచున్నారు. ఇవన్నియు ప్రజలొనరించు నవీనవ్యాపార పరిశోధనల ఫలితము. ఆరోగ్యశాఖవారికి ఆమోదకరము.

ధాన్యములనుండి తొలగిపోవు భాగములు ముఖమునకు ముక్కు అందమన్నట్లు—వడ్లను మరకువేసి తెల్లగా బియ్యముచేయిస్తే తవుడును అంటుకొన్నమొలక యెప్పుడో వూడిపోవును. బలమివ్వజాలవు. బియ్యమునుంచి వచ్చేతవుడు ఆవిరిబారినందున, ఆయిలుయొక్క యింపుగాని వాసనలవల్ల ఆ తవుడును మనయింటనున్న పశువులుకూడ ముట్టవు. ముట్టినను సరిఅయిన పాలివ్వవు. ఇచ్చిననూ మనశరీరముకుపడవు. తవుడు పశువులు తినకున్ననూ తవుడులేని బియ్యమును మనము తినుటవల్లనే మన ఆరోగ్యము తప్పుత్రోవల నడచుచున్నది. అట్టిపాలు పసిపిల్లలకువాడిన లివరువ్యాధులు తప్పవు. ఉప్పుడు బియ్యము మరబియ్యము కంటె మంచివి.

## కత్రిరుగల్లు

పూర్వము వుండెనివి. ఇప్పుడు అనవసరము. ఉన్ననూ త్రిప్పజాలరు. మనమే విసురుడుముగాన వంటికిబలము, తినుటకు హితవుగానుండును.

పాకకళాభ్యాసకులు గమనించవలసిన విధులు

1. గంజివార్చుట పెద్దపొరబాటు

2. బియ్యమును పలుమారు కడుగకూడదు.

3. అత్తెసరు (అందరికి తెలియును)గా వండుటమంచిది.

4. జబ్బుపడిలేచినవారికి పునఃపాకము చేయవలయును. అయితే అంత మంచిదికాదు. ఏకపర్యాయము పెట్టుటకన్న ప్రతి 5 గంటలకు ఆకలి, అవసరముల ననుసరించి పెట్టుటమేలు. బాగాఉడికిన అన్నమయిన భుజించునప్పుడు ముద్దలుకావు. అందుచే కుండవంటి పొట్టలు పెరగవు.

5. ఇగురబెట్టిన అన్నము యింటివారికందరకు సరిపోవును.

6. మరబియ్యం వాడుట ఆరోగ్యభంగం. పొయ్యివద్ద యేమాత్రము ఏమారిననూ ఆ అన్నము యెవరికిసరిపోదు. లోకోభిన్నరుచి యనినట్లేవుండును.

7. ఏబియ్యందొరకినా చాలుననుకునే యీరోజులలో మరింతజాగరూకులై యుండవలయును.

8. పశుసంపద పయిన ఆధారపడిన మన దేశమున వ్యవసాయ ధాన్యములను యంత్రములు మరలపాలు చేయరాదు.



# అ ఖ ం డ స్వా గ త ము

మధురకవి బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు

శ్యామలాంబోధరంబులు చల్లగా, ప్ర
శాంతముగ నావరించెడి చదల నెల్ల
తరుణ మేతెంచె జీవితోత్సాహమునకు
ఓబలాకమ, స్వాగతమోయినీకు.

క్రావ్యముగ, భీకరంబుగా సకలదిశలు
మారుమ్రోసెడి గర్జావిరావములను
సమయ మేతెంచె జీవితోత్సాహమునకు
ఓశిలీంధ్రమ స్వాగతమోయినీకు.

కనులపండువుగా మనోజ్ఞముగ హృదయ
రంజకముగ, తటిల్లతాప్రభలు దోచె
తరుణమేతెంచె జీవితోత్సాహమునకు
మొగలిపుష్పమ స్వాగతమోయినీకు.

భావనోద్వేగముగ, సుధాప్రాయముగ, ధ
రాస్థలినిదోచెవర్ష ధారాస్వనంబు
సమయమేతెంచె జీవితోత్సాహమునకు
వానకోయిల స్వాగతపథము నీకు.



# బ్ర తు కు తె రు వు



లెమన్ జెల్లి:-మంచి నిమ్మకాయ రుచిగలవస్తువు. మిఠాయి దినుసుగాకూడ తయారొనర్చవచ్చును.

| | |
|---|---|
| నిమ్మకాయలు | 12 |
| చల్లని నీళ్లు | 1 శేరు |
| పంచదార | పైవాటికి సుమారుగ సరిపోవు |

నట్లు ½ వీశె వుంచుకొనవలయును. పల్చని చర్మముగల పరిశుభ్రమయిన నిమ్మకాయలను తీసుకొని బాగుగాకడిగి తుడిచినతర్వాత చెక్కుతీయవలయును. చెక్కుతీయుటలో లోపమున్న రుచికూడా లోపించును. చేదుగానుండును. తదుపరి చిన్నచిన్న ముక్కలగునట్లుకోసి నీరున్నగిన్నెలో వేయవలయును. పొయ్యిమీద కొద్దిపాటి సెగపయిన అర్ధగంటసేపువుంచి కొంచెము చల్లారగనే ఆముక్కలపయిన మిగిలియుండు తెల్లనిచర్మమును వలువ వలయును. రసముతోనిండిన ముత్యములవంటి చిన్నతొనలు ముక్కలగునట్లు వానిని వెడల్పాటి గిన్నెలోనుంచి వకగంటసేపు కాగబెట్టి, కాచునపుడు పలుమారు గరిటతో త్రిప్పుచు వడకట్టుటకు నిర్ణయించుకున్న గుడ్డతో పిండకుండ వడబోసి అట్లు వచ్చినద్రవమునుకొల్చివచ్చినదానికి సుమారుగ పంచదారపోసి మరలకాచి ఆవచ్చినజెల్లిని జాడీలలోనుంచి భద్రపరచి వ్యాపారసూచనలు, రుచినిపురిగొల్పు వాక్యములతో చీట్లుఅంటించి నిలువచేయచూ, సరుకు రవాణాచేయుచుండిన బ్రతుకుతెరువులకు మార్గమగును.

ఈమాదిరిగనే కిచ్చలి, నారింజ, కమలాపండ్లతోటి చేసుకొనవచ్చును. ఇట్టి పరిశ్రమలు మొదలుపెట్టినతర్వాత నాగపూరు కమలాలు యిచ్చుటకువచ్చుట, వడ్లపూడి నారింజ వన్నెకెక్కి పలుప్రాంతములకూ, దేశములకూ పరుగులిడుట చూచుచునే యున్నాము. ఇట్టివి అరుచికల్గినప్పుడూ బిడ్డలకు తిను బండారములపై యిచ్ఛజనించు కాలమున నిచ్చిన మంచి ఆరోగ్యమిచ్చును.

కాయలతోలు పల్చగనుండిన కొంతకాల ముంచుకొనుటకు పనికివచ్చును.

---

# ఇంటిపనులలో మెళుకువలు

## తల్లిప్రేమ — శిశుపోషణ

బిడ్డలపై తల్లికివుండే ప్రేమను దేనితో పోల్చుటకును అలవికానిది. బిడ్డలు ఆరోగ్యముగా, ఆనందముగా తిరుగుతుంటే, ఆతల్లిమనస్సు, ఎంతైనా, సంతోషంగా వుత్సాహంగా వుంటుంది. తండ్రి డబ్బుసంపాదన కొరకే పాటుపడతాడు. కాని, బిడ్డలవిషయములో ఏమితింటున్నారో, ఎలావుంటున్నారో అనే దృష్టి వుండదు. ఏదోముద్దువచ్చినప్పుడు ఒక్కమారు దగ్గిరగాతీసుకొన్ననూ, ఏలాగున వాళ్ళనుబుజ్జగించాలో ఏలాగున ముద్దులాడాలోకూడా తెలియక కస్సు, బుస్సు మనేసరికి, ఆచిన్నప్రాణాలు హడలి పారిపోవలసిందే కాని, తల్లిదగ్గిరవుండే చనువు, తల్లియెడల వుండే ప్రేమ, ఆబిడ్డలకుకూడా తండ్రియెడల వుండదు. తండ్రిని చూస్తే బిడ్డలకు ఎంతో భయంగా వుంటుంది. కంటినిండా చూచుకొని, చేతినిండా పెట్టుకోవాలని, వంటి నిండా నగలుపెట్టాలని, మంచిబట్టలుకట్టాలని, ఎన్నెన్నో కోరికలు పెట్టుకొని, ఆబిడ్డలతోడిదే లోకమని భావించి, తల్లి ఏప్రొద్దు, ఆబిడ్డలను సర్వదా కాపాడమని భగవంతుని ప్రార్థిస్తుంది.

బిడ్డలకు బట్టకట్టి, బొట్టుపెట్టి, జుట్టుదువ్వి వక్కమారు కంటినిండాచూచుకొని, ఎంతో ఆనందించి, తనమనస్సును తానే నమ్మక, ఎవరిదృష్టి తగులునోయని యెన్నో అంగరక్షలు చేసుకుని కుదుటపడుతుంది ఆ తల్లిహృదయం. యీవిధముగా బిడ్డల ప్రతివిషయములో తండ్రికంటె, తల్లికి వేయిరెట్లు ప్రేమబాధ్యతలు ఎక్కువని నొక్కి చెప్పొచ్చు. గొప్పయింటిబిడ్డయైన అల్లారుముద్దుగా, ఆభరణములతోను, ముద్దినునుబట్టల తోను, రకరకాల పిండివంటలతోను అపురూపముగా అల్లారుముద్దుగా, పెరుగుతుంది. పేదయింటిబిడ్డ అయిన ఏ గంజిఅన్నముపెట్టో, ఏ చినిగినబట్టలుకట్టో ఏలాగో రోజులువెళ్ళబుచ్చుతూ, తనబిడ్డ తనకేముద్దని పెంచుకుంటుంది ఆ పేదతల్లి. తల్లిప్రేమకుపేద, గొప్పఅనేభేదమేలేదు. కాని బిడ్డలను మనము ఎంత ఆసక్తితో కంటామో, ఎంతకష్టపడికంటామో, అంతబిడ్డలపై దృష్టినుంచుకొని, వాళ్ళను పెంచడముకూడా చాలాజాగ్రత్తగాను, చాలా ఓపికతోనువుండాలని నాసోదరీమణులకు విన్నవిస్తూ, యీ నావాక్యములను అర్థముచేసుకొని, మంచిని గ్రహించి చెడుగును వదిలిపెట్టమని ప్రార్థిస్తున్నాను.

బిడ్డపోషణ విషయమై తల్లిచూపవలసినది ఎంతైనావుంది, తండ్రిసంపాదనకొరకే పాటుపడలేడు. కాని బిడ్డల సంరక్షణవిషయములో తల్లిదేబాధ్యత, బిడ్డలకు ఎక్కువగా చిరుతిండి అలవాటుచెయ్యకూడదు. దానివల్ల బిడ్డలఆరోగ్యము చెడిపోవును, అజీర్నవ్యాధి పట్టుకొని, పొట్టపెరిగి, చాలాబలహీనులవుతారు. అడిగినప్పుడల్లా ఏదోవకటి పెట్టడము, ఏడ్చినప్పుడల్లా పాలుఇవ్వడము తల్లిచేసే దురలవాట్లలో వకటి, అలా చేసినందువల్ల ఆబిడ్డల జీర్నకోశము పాడై అనేకరకముల బాధలుపడుతుంటే వాళ్ళనుచూచి, తల్లులు బాధ పడవలసి వుంటుంది. కానవేళను తెలుసుకొని, మితముగాపెట్టిన ఏమీబాధించదు. అజీర్నసంబంధమైన బాధలుపడే బిడ్డలకు (అనగా) 4, 5, సంవత్సరములలోపు వాళ్లకు, వుదయమే నిద్రనుండిలేచేసరికి, కొద్దిగా శొంఠి, కొంచముగా బియ్యము, స్వల్పముగా పాతబెల్లమువేసి, జారుగారుబ్బి, కొద్దిగా నేతినిమరగనిచ్చి, యీజారుగా రుబ్బివుంచినదానిని ఆనేతిలోవేగనిచ్చి, బిడ్డలకుపెట్టిన, వుదయమే టిఫినువలె ఎంతో ఆనందముతో నోటికిరుచిగా తిందురు. దానివల్ల బిడ్డల అజీర్తితగ్గి వుత్సాహముగా ఆడుకొందురు. లేనిచో అజీర్తి బిడ్డలను ప్రాణాపాయస్థితికి తేవటానికి సందేహములేదు. మనబిడ్డలవిషయములో తల్లులకుండవలసిన మెళుకువలు, వాళ్లస్వబుద్ధివల్లగాని, లేక ఇతరులవల్ల తెలుసుకొనిగాని చేసిచూచిన నిదానముగా బోధపడ గలదు. ప్రతిదానికి మందులు విశేషము వాడుటకంటె, యీవిధముగానే బిడ్డల ఆరోగ్యమును కాపాడుకో వచ్చునని నేను అనుభవపూర్వముకగా నాసోదరీమణులకు మనవిచేస్తున్నాను. ఇంకా బిడ్డలవిషయములో తల్లులు చేయవలసినవిధానము, చాలగావున్నది. యీసరికి ఇంతటితో ముగిస్తూ, యింకొకమారు మనవి చేసుకుంటాను.

కె. సత్యవతమ్మ

## 'గృహలక్ష్మి' కి తెలియదగిన సంగతులు

చిన్నబిడ్డలు పుస్తకాలమీద సిరాదొర్లించుకొని ఏడుస్తూ ఉంటారు. వాళ్లను ఎందుకు దొర్లించుకున్నావు, అని తిట్టి కొట్టి, లాభంలేదు; ఆమరకలు, పోగొట్టే ఉపాయంచేసి వాళ్లకు ఉల్లాసంకల్గించాలి. ఆక్సాలిక్ ఏసిడ్ (Oxalic acid) న్నూ నీళ్లున్నూ కలిపి ద్రావకంచేసి దానితో ఆమరకలు రుద్దితే పోతవి.

*　　　　*　　　　*

అద్దాలు ఆచేయి ఈచేయి తగిలి జిడ్డుపట్టుతుంటాయి. వాటిని నీళ్లతో కడిగి తుడిస్తే మరీ మసక మసకగా ఉండిపోతాయి, ఆనీళ్లలో కాస్త ధాన్యపుపిండి (Starch) కూడా చేరిస్తే-మురికిఅంతా వదలి అద్దాలు తళతళలాడుతాయి.

*　　　　*　　　　*

ఎండలో వెళ్లేటప్పుడు ఎండకు మొగముమాడిపోకుండా-ఉపాయం : ముఖము పాలతో కడుక్కొని తుడవకుండా అలాగే ఆరనీ. కొన్నినిమిషాలు చికాకుగా ఉంటుందిగాని దానివల్ల మొగానికి ఎండదెబ్బ తగలదు.

*　　　　*　　　　*

ఆకుకూరలు ఉడికించునప్పుడు రంగుచెడకుండా ఉండగలందులకు ఒక చిన్నగరిటెడు పంచదార వేసిననీళ్లతో ఉడకబెట్టు. దానివల్ల ఆకుకూరకు సువాసనవస్తుంది; ప్రాణశక్తులు (విటమిన్ లు) నశించవు.

*　　　　*　　　　*

చిన్నబిడ్డల కుపయోగించే ఆయిల్ క్లాత్ తరచు బిరుసెక్కి పెట్లిపోతుంటుంది. దానికి పులిసిన ద్రాక్షసారాయము (Vinegar) చమురుకలిపి పలుమారురుద్దితే ఆవిధంగా పెట్లిపోదు.

*　　　　*　　　　*

పెట్టెలలోచేరే పురుగులను పారద్రోలడానికి పెట్టెలో లవంగాలుచల్లిఉంచండి. కలరాఉండలు (Naphthalene balls) కంటే మంచి ఫలితమిస్తుంది.

*　　　　*　　　　*

గుడ్డలమీద చాకలి సిరాగుర్తు తుడిచివేయాలంటే నిమ్మఉప్పు నీళ్లలోకలిపి ఒంటెబొచ్చు బ్రష్‌తో రుద్దివేయండి.

*　　　　*　　　　*

గుడ్డల కంటుకొనే తుడుపరాని మరకలు పోగొట్టను పెట్రోలుపయోగిస్తుంటారు; అయినా-గీతల మాదిరి నిల్చిపోతాయి. అవీ లేకుండా వుండాలంటే ఆ పెట్రోలులో ఒక చిటికెడు ఉప్పుకలిపి తేసరి.

*　　　　*　　　　*

బ్రష్షులు దువ్వెనలు ఎప్పుడూ జిడ్డుకారుతుంటాయి. ఒకటీగంటెడునవాసారము పాతికగాలన్ నీళ్లలోకలిపి ఆ నీళ్లలో వాటినితోమి, కడిగి ఆరబెట్టితే శుభ్రంగా ఉంటాయి.





POND'S
POND'S


















# స్త్రీఉద్యమము — నెల్లూరుమండలము

గాంధీయుగమునందు అసహాయోద్యమమున నెల్లూరుమండలములోని యువతీమణులు గావించిన దేశసేవను చిత్రించుటకు ముందు, ఈ మండలముయొక్క ఔన్నత్యమును కొంత తడవుట అసభ్యముకానేరదు. భారతకాలమునుండి నేటివరకును యీ మండలమునందలి నారీమణుల ధైర్యసాహసములను, సౌందర్యసౌష్టవములును తిక్కనకవి మహాభారతమునందు విరాటపర్వమునందు కీచకుడు ద్రౌపదిని అవమానపరచ దలచినపుడు వర్ణించినవిధము పాఠకమహాజనులకు పరిచితముగా గలదు. నేటికిని గ్రామీణులగు కమ్మకాపు తెగలకుచెందిన సంసారస్త్రీలు పై ఘట్టమునందలి పాంచాలిని మరపింప జాలుదురు. ఇంతేగాదు, బ్రాహ్మణులు పౌరుషప్రధానులుగారనుచు తిక్కనరచించిన "వారు బ్రాహ్మణులె వీకిడైన సైరింపగల" అను నానుడి చరిత్రమునకు వ్యతిరేకము. రణతిక్కనకాలమునందు అయనతల్లియును భార్యయును, రణరంగమునువీడి ఇంటికివచ్చిన రణతిక్కనను పరిహసించి, పౌరుషము రేకెత్తించినకథ ఆంధ్రావళికి చిరపరిచయమేగదా!

"పరగఁత వెన్నిచ్చినచో। నగరే నిజ మగతనంపు నాయకతెందుక..."

తరువాత 15 మొదలు 19 శతాబ్దములవరకు భరతవర్షముపడిన అరాచకపు టగచాట్లలో నెల్లూరుమండలమును తన భాగస్వామ్యమును బడసినది. హైదరుదండును, మరాటీల దోపిళ్లును, దారిదోపిడిగాండ్ర అరాచకములును దేశమును కల్లోలపెట్టుచుండిన తరుణమున కడుసాహసురాండ్రై, గ్రామములను స్త్రీలమానములను కాపాడిన సుప్రసిద్ధ వనితారత్నములలో వరగలి కామాక్షమ్మపేరు స్వర్ణాక్షరములతో - నెల్లూరుమండల యువతీహృదయఫలకములమీద వ్రాయబడిన గీతము లింకను మాయలేదు.

ఇక నేడు గాంధీమహాత్మునికినచ్చిన రాట్నపరిశ్రమకు నెల్లూరుమండలముపెట్టనికోట యన్న నతిశయోక్తికాజాలదు. రాట్నముతిప్పని సంసారియువతిగాని, మగ్గముఆడించని సాలెపాళెముగాని, మాలవాడగాని చాల అరుదు. యీ మండలములో తయారుకాబడ్డ సున్నితపునూలును, నేయబడిన నగిషీవస్త్రములును మండలాంతరములందు వన్నెవాసి గాంచినవి. నేడు కనుపూరు నూలుగాని, కంసుకూరు నేతలుగాని, సరియగు పోషణలేక కానగాచిన వెన్నెలయగుట సులభగ్రాహ్యముగదా.

ఇక విదుషీరత్నములు ఆంధ్రసారస్వతప్రపంచమునం దున్నతస్థానమును బడసిన విషయము జగద్విదితము. ఆతుకూరి మొల్ల, తరిగొండ వెంగమ్మ కవయిత్రీమణులలో మణిపూసలుగా నలరుట తెలియకపోదు.

ఇంతటి ప్రశస్తిగల నెల్లూరుమండలము పరపాలనమునుండి విడివడుటకు గాంధీ మహాత్ముని నాయకత్వమున తలయెత్తిన అసహాయోద్యమమునందును ప్రధానస్థానమును గావించిరనుటకు సంతసింపవలసియున్నది. మహాత్ముని శంఖారవముతో వకీళ్లు తమపట్టాలకును, విద్యార్థులు తమపాఠశాలలకును, వర్తకులు తమ సీమవ్యాపారములకును స్వస్తిచెప్పినపుడు యువతీమణులు తమ గృహసీమలనువదలి శాంతిసమరరంగములోనికి దుమికిరి.

శ్రీమతులు పాటూరు బాలసరస్వతమ్మ, పొణకా కనకమ్మగారలు నాయకత్వము వహించి మండలములో స్త్రీజనోద్యమమును లేవనెత్తిరి. స్త్రీలకాంగ్రెసుసంఘమును, శ్రీ కస్తూరీదేవి బాలికాపాఠశాలను నెలకొల్పి, కాంగ్రెసు సేవలో నిమగ్నులైరి. కనకమ్మగారును, బాలసరస్వతమ్మగారును నాయకత్వము వహించి, కల్లంగళ్ల బహిష్కారము, సీమగుడ్డల అంగళ్లు పికెటింగు, ఖద్దరువిక్రయము, విరివిగా సాగించిరి. వీరికితోడుగా మండలములోని అన్ని తాలూకాలలోని స్త్రీలు వీరికితోడ్పడిరి. ప్రభుత్వముతో పోరాటము వచ్చినపుడు వీరికితోడుగ, కీ॥ శే॥ ఓరుగంటి మహాలక్ష్మమ్మగారును, ముత్తుకూరు కామమ్మగారును, భట్టా సుందరమ్మగారు మొదలగు స్త్రీరత్నములు వెంటనుండి కారాగృహములకు సైతము ప్రవేశించిరి. నెల్లూరుమండలములో స్త్రీలుగావించిన కాంగ్రెసు ప్రచారఫలితమే నేడు విరాజిల్లుచుండు కస్తూరీదేవి ఉన్నతవిద్యాలయము. 'నెల్లూరి వనిత'

# సామెతలు

241 మ్రానిపండ్లు మ్రాని క్రిందనే రాలును.

242 అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?

243 మంచివారికి మరణమే సాక్షి.

244 మింగ మెతుకులేదు; మీసాలకు సంపంగినూనె.

245 వానరాకడ, ప్రాణముపోకడ ఎవరికి తెలియును?

246 మూన్నాళ్ళు సాముచేసి మూలింటనున్న ముసలమ్మను చంపినట్లు.

247 రాయిగుద్దనేల? చెయ్యినొవ్వనేల?

248 నిర్భాగ్యునకు నిద్దుర, అభాగ్యున కాకలి యధికము.

249 కలిగినది చెప్పిన కంటిలో పుల్లబెట్టినట్లు.

250 నక్కలం ఎరుగని బొక్కలం - నాగులం ఎఱుగని పుట్టలం కలవా?

251 దొంగసొమ్ములం దొరలపాలం.

252 సమయమునకు లేనిది చంకనాకనా?

253 దాసరితప్పులు దండముతో సరి.

254 దురాశ దుఃఖమునకు మూలము.

255 పడ్డించేవాడు తనవాడైన కడపటిబంతితో కూర్చున్నా ఒకటే.

256 లక్షనక్షత్రములయినా ఒక్క చంద్రునితో సమానముకాదు.

257 వెదుకబోయినతీగె కాళ్లకు దగుల్కొన్నట్లు.

258 శిరసుండగ మోకాటికి ఏల పూజ?

259 వేసాలన్నియు గ్రాసాలకే.

260 దుష్టునిచూచిన ఒకఅడుగు దూరములో యుండవలెను.

261 వైద్యునిపేరు చెప్పినమాత్రాన రోగము నివారించునే?

262 వానవుంటే కఱువు, పెనిమిటివుంటే దారిద్ర్యములేదు.

263 వెన్నలో వెంట్రుక తీసినట్లు.

264 భిక్షాధికారైనా, లక్షాధికారైనా కావలె.

265 లాభములేనిది శెట్టి యేటిలోపడడు,

266 వీపుమీఁద కొట్టవచ్చునుగాని కడుపుమీద కొట్టరాదు.

267 బుద్ధిలేని చదువు బూడిద హోమము.

268 చదవవేసిన యున్నమతి పోయె.

269 పంది బురదమెచ్చునుగాని పన్నీరుమెచ్చునా?

270 పాలముంచినా నీటముంచినా మీదే భారము.

271 పులినిజూచినక్క వాతపెట్టుకొన్నట్టు.

272 దెబ్బకుదెయ్యము సహా వదలుతుంది.

273 నవ్వేఆడవారిని, ఏడిచే మగవారిని నమ్మరాదు.

274 దాసికొడుకైనను కాసులు గలవాడే రాజు.

275 ఇనుము విరిగిన అతుకవచ్చునుగాని మనసువిరిగిన అతకడ మసాధ్యము.

276 అరచేత వెన్నబెట్టుకొని నేతికి యేడ్చినట్లు.

277 ఉండేదిగట్టి; పోయినదిపొట్టు.

278 ఊరపిచ్చుకలమీద వాడి వజ్రాయుధమా?

279 కట్టలేనివానిని గొడ్డుఅయినాకఱచును.

280 పెరుగుట విరుగుటకొఱకే, ధరతగ్గుట హెచ్చుకొఱకే.

281 కుక్కతోకబట్టుకొని గోదావరినీదవచ్చునా?

282 కాటికిపోయినా కరణమును నమ్మరాదు.

283 కలిమిలేములు కావడికుండలు.

284 ఎవరి ప్రాణము వారికితీపు.

285 ఎలుక చావుకు పిల్లి మూర్ఛపోవునా?

286 చిచ్చంటుకొన్న పిదప చేటలతో నార్ప శక్యంబగునే?

287 ఒకయబద్ధముకప్పుటకు పది అబద్ధములాడవలెను.

288 ఏనుగు పడుండినను గుఱ్ఱమంత ఎత్తుండును.

289 ఒకటే ఒరలో రెండుకత్తులిముడవు.

290 కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.

291 కుక్కకాటుకు చెప్పుదెబ్బ మందు.

292 వినినవన్ని విశ్వసించవలదు, విశ్వసించినవన్ని వెలిబుచ్చవలదు.

293 దొంగనుపట్టుటకు దొంగే కావలయును.

294 వేడినీళ్లకు ఓర్వలేనమ్మ సహగమనము చేస్తానన్నదట!

295 ముంతెడునీళ్లకే యులికిపడిన కడివెడునీళ్లు పోసికొనుట నిజమా?

296 తలలుబోడియైన తలంపులు బోడులగునా?

297 బావా నీభార్య ముండమోసిందోయి అనగా మొర్రోఅని యేడ్చినాడఁట.

298 నిద్రపోవువానిని లేపవచ్చునుగాని మేల్కొన్నవారిని లేపలేము.

299 పెండ్లిసందడిలో బొట్టుకట్ట మరచినాడట.

300 దిక్కులేనివారికి దేవుఁడేదిక్కు.

301 దొంగకు తేలుగుట్టినట్లు.

302 పద్మరాగములు కలగనిలో గాజు పెంకులుండునా?

303 నిండుకుండెన్నటికి తొణకదు.

304 కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగదు.

305 కడుపు కూటికి ఏడ్చిన, కొప్పు పూలకేడ్చును.

306 కట్టెవంక పొయ్యితీర్చును.

307 కూసేగాడిదవచ్చి మేసేగాడిదను చెరిచినది.

308 చక్కిలాలుతింటావా - చద్దితింటావా అంటే చక్కిలాలుతింటాను; చద్దీతింటాను; అయ్యతో వేఁడీతింటాను అన్నాడట.

309 చీకటికొన్నాళ్ళు వెన్నెలకొన్నాళ్ళు.

310 శెట్టి శృంగారించేలోగా పట్టణము కొల్లపోయింది.

—వి. మనోహరి.

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

శ్రీ కల్లూరు అహోబలరావుగారు

అత్తకుఁ గోడలవయినన్
హత్తెను నీమీద భరమునపుడేమేమో
చిత్తమునఁ దోచుచుండును
క్రొత్తప్రపంచంబు తెలిసికో గృహలక్ష్మీ!

అత్తయును మామబంధులు
క్రొత్తలుగా దోచుచుంద్రు కోమలి! నీకున్
తత్తఱపాటులు వలవదు
చిత్తస్థైర్యంబువలయు; శ్రీగృహలక్ష్మీ!

మృదుపలుకులు మృదునడతలు
పదిలముగాఁబనులుసేయు భావమునోర్పున్
కుదురుగఁ గల్గియునుండిన
సుదతీ! నినుమెచ్చుచుంద్రు; శుభగృహలక్ష్మీ!

నీనోటిమంచితనమె
ఏనూరువరాలుసుమ్మి; హితమతివై, స
న్మానమొనర్చుము పెద్దల
న్యూనత నీకేమిలేదు ఓగృహలక్ష్మీ!

వచ్చినపను లెల్లంటిని
మచ్చికతోఁ జేయుమమ్మ మైయలయంగన్
మెచ్చెద రత్తలుమామలు
సచ్చరితవటంచునిన్ను; జయగృహలక్ష్మీ!

భర్తకు హృదయం బొసగుము
కర్తగదా! సౌఖ్యదుఃఖకారకుఁడతడా
మూర్తిని భక్తినిఁ గొల్చిన
ఆర్తులు కృశియించి సమయవా? గృహలక్ష్మీ!

# వితంతు వివాహములు



శ్రీమతి వల్లూరుపల్లి వెంకటరత్నమణీబాయిగారు

అశుభము, శుభము ఎఱుగని అజ్ఞానదశను భర్తనుపోగొట్టుకున్న పడుచులకు పునర్వివాహముచేయుటలో తప్పేమి? మానవహృదయాలు రాక్షసహృదయాలుగా మారడమువలన అమాయికపు వితంతు జీవితాలెన్నియో దుఃఖభాజనములై పోతున్నా చూడక అనవసరములు, అప్రస్తుతములు అయిన ఇతరసమస్యల్లో తగులుకుని కాలయాపన చేస్తున్నది నేటిసంఘము.

ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలకు వివాహముచేసి, కర్మవశాన వారిభర్తలుపోతే, ఆకన్యలను జన్మాంతమూ పురుషసంపర్కములేక, కోరికలను చంపుకుని, జీవితములో లేశమయినా ఆనందములేక, సౌందర్యమును యౌవనమును దుమ్ములోపోసికొని బ్రతుకుమని శాసించడము కంటే యింకేమయిన ఘోరముండదు. పోయినభర్త నెవరూ తెచ్చియీయలేరు. అయితే ఈదురదృష్టానికి తోడుదయారహితములయిన రాక్షస హృదయాలతో ఈసంఘము, ప్రజలూ, ఆ ముగ్ధవితంతుజీవితాలకు మరింత దుఃఖమును తెచ్చిపెడుతున్నారు. వితంతుకన్యలుమాత్రము మానవజన్మలెత్తలేదు? ఈసంఘము వారియెడ ఇటువంటి కాఠిన్యమును పూనడముకంటే యింకో అన్యాయమేముంది? దేదీప్యమానంగా వెలిగిపోతున్నవారి అద్భుతసౌందర్యాన్ని చేతులారా ధ్వంసముచేస్తున్న ఈపాడుసంఘాన్ని ఎన్నివిధాల శపిస్తే తప్పౌంది?

పాడుసంఘము. ఈసంఘానికి స్వలాభముతప్ప మరేమీ అక్కరలేదు. ఎందరి వితంతు జీవితాలు దగ్ధమైపోయినా ఈసంఘము లెక్కచెయ్యదు. వితంతువులు ఎంతమంది ఎన్నెన్ని కష్టాలుపడుతున్నా చూచి ఒకనిట్టూర్పుఅయినా విడువదీసంఘము. అటువంటి సంఘానికి భయపడి ఆనందడోలికలనూగవలసిన నూరేండ్ల బ్రతుకును ఎందుకుదగ్ధం చేసుకోవాలి? వితంతువులకు పునర్వివాహములు చేయుటవలన, ఏభైయేళ్లవృద్ధాప్యములో వివాహంచేసుకొని, ఒకకన్యయొక్క జీవితమును దుఃఖభాజనము చెయ్యబోతున్నవారికి కలిగేపాపముకంటే అధికమయిన పాపముకలుగదు. వితంతువులకు వివాహాలు పనికిరావని, భర్తలుపోయిన పడుచు కన్యలను తమయిళ్లల్లోపెట్టుకొని, వారుప్రకృతికి లొంగి గావించేప్రతికార్యాన్ని కడుపులోపెట్టుకొని పూరుకొనేవారికి వచ్చేపాపముకంటే అధిక మయిన పాపమురాదు. కళ్లుతెరువని కన్యప్రాయములో, తెలియకుండా, ఎవరినో వారి

కంఠానికిజుట్టి. వాడు విధివశముచేత, ఈలోకాన్ని విడిచిపెట్టిపోతే, ఆకన్యల నూరేండ్ల బ్రతుకును దుమ్ముపాలు గావించినవారికి కలిగేపాపముకంటే అధికమయినపాపము కలుగదు.

ఓ కపటసంఘసంస్కర్తలారా! వితంతుజీవితములోని కష్టము, భర్తృవిరహితులయిన కాంతలుపొందే దుఃఖము మీకేమైనా తెలుసా? కర్కశహృదయులైన మీకేమి తెలుస్తుందిలే! మీకండ్లయెదుట దుర్భరయాతనాపరంపరలదేలుచు, జీవితాలను దగ్ధంచేసుకొని, బ్రతుకుపై యాసవదలుకొని, మితిలేని దుఃఖమును పొందుతున్న వితంతుబాలికలనుజూచి కనికరించండి. వారియుసురులు మీకుతగులక మానవు. వితంతువివాహము శాస్త్రసమ్మతము. ముక్కుపచ్చలారని ముద్దుప్రాయములో ముండమోసి, పురుషసంపర్కమున ఏమీఎరుగని కన్యలకు పునర్వివాహములు చేయటలో తప్పులేదని నేనంటాను పాఠకులారా, మీరేమంటారు? శలవు!




విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు

(గతసంచిక తరువాయి)

"ఏదియెట్టులైన నిష్పడీహీనవధము, నుండి కాపాడగావలె నుపయసింహు
దరతరమ్ముల బోషించు తండ్రిఋణము తీర్చుకొనగను సమయ మేతెంచియుండె."
అనుచుబలుకగ నాపితు "డదియునధిక దుర్ఘటంబైన నీపంచుత్రోవనేగ్గువాడ"
ననివల్కె బ్రభుభక్తిస్వాంతుడగుచు; కొంచెముమనంబునందు దర్కించియామె.

బాలునిస్థలాంతరమునకు బంపవలయు, నని వనవీరుడే బాలకుని నగరము
వెడలి పోనీయరాదని విధియొనర్చె, గాన నెర వేరు కార్యముగాదటంచు.

మంగలివచింప 'పన్నా' యుమరలవగచి, వీని నొకతట్టలో బెట్టి పైన బెంట,
వోసియిచ్చెద దోడ్కొని పురమునుండి, వెడలిపొమ్మంచుబలుక నాపితున కతడు.

క్షణములో వనవీరుడిచ్చటికివచ్చి, రాజసుతుగాన డేని చారనివహమును,
బంపియెట్టులైనదెప్పించు బ్రభుకుమారుప్రాణముల గావనేర మెప్పాటనైన.

అనిపలుకగవినిమనమున ఘనముగయోజించియామె కర్తవ్యం బీ
వనికై వగవక మదితన తనయుండిందుండు రాజతనయు బదులుగాన్.

అనిరాజతనయు నగలను దనతనయుని మేనదొడిగి తక్షణ మతనిం
ఘనరాజపుత్రుతల్పమునను బండగబెట్టి తట్ట నాపితుకిచ్చెన్.

ఏవిధిజెప్పియు పన్నా భావంబుమరల్పలేక పరమాశ్చర్యో
ద్భాసితుడయి యామంగలి, భావిం దలపోయు చేగె బాలునితోడన్.

రాచకొమరునిబంపిభద్రముగనామె నిదురబోవుచు నున్నట్టి నిజకుమారు
ప్రాజ్యపర్యంకతల సమీపమ్మునన వనవీరురాకడ కొఱకునై వేచియుండె.

కాలునిపగిదిగ నతడ క్కాలంబునవచ్చి బాలుగని తనమనమం
దే లవశంకయువిడి కరవాలమ్మున బొడిచివైచి పరువెత్తె వెసన్.

అసిప్రపాతమ్మునకు దాళకర్భకుండు, కరినభీకరమారణాక్రందనంబు,
తోడ బ్రాణంబులను విడనాడెనప్పు డాధ్వనికి వచ్చి రచ్చటి కఖిలజనులు.

(సశేషము)



ఆడవారిలో మైత్రి చాలా వేగిరం కుదురుతుందనే చెప్పాలి. ఒక వీధిలోకి కొత్తగా ఒక కుటుంబం వచ్చిందనుకోండి; ఆ కుటుంబంలోని స్త్రీగాని స్త్రీలుగాని, ఇరుగుపొరుగు అమ్మలక్కలతో చాలా వేగిరం - స్నేహం కలుపుకుంటారు, ఎట్లానో అట్లాగ.

ఓవీధులోని ఆడవాళ్ళందరూ, ప్రతిరోజూనా, బాతాఖానీ వేసే వేళలుంటాయి. సాధారణంగా, భర్తలు ఆఫీసులకి "వయచే శా"క ఆడవాళ్ళం దరూ ఓచోటకూడి, తమ తమ గొప్పలనిగురించీ, సాధక బాధకాలగురించీ, తమపిల్లల గొప్పలను గురించి, మాట్లాడుకుంటూ కాలక్షేపం చేస్తారు. ఇటువంటి బాతాఖాని సమావేశాల్లో, ప్రతీ స్త్రీ తన గొప్పదనాన్ని వెల్లడిచేసుకొని మిగతస్త్రీల అభిమానాన్ని (అసూయనుకూడా!) చూరగొందామని ప్రయత్నిస్తుంది; తమకు ప్రపంచంలో తెలిసిన అన్నివిషయాలనూ, (తెలియనివాటినికూడా!) ఈ సమావేశాల్లో దొర్లించివేసి, కాలాన్ని యిట్టే గడిపి వేస్తారు! ఈ బాతాఖానీసభలు స్త్రీలకు ఏమైనా విజ్ఞానబోధను చేస్తాయా అనేది వేరేవిషయం——... వాటియొక్క ముఖ్యోద్దేశం కాలాన్ని నెట్టి వేయడమే.

ఈ సమావేశాల్లో నిరంతరందొర్లిపోయేవిషయాలు చాలావిచిత్రంగా కన్పిస్తాయి!—ఒకామె (పెద్ద వుద్యోగస్థునిభార్య) తన ఇంటినిగురించీ, "సర్వెంట్సు"ను గురించి, తన శిల్కుచీరలను గురించీ, వీలైనంతఘనంగా చెప్పుకుంటుంది! మరొకామె తనపిల్లలయొక్క సుగుణాలను, చేష్టలను, తెల్వితేటలను (ఒకరకం జీవితచరిత్రలు అనవచ్చు!) గురించి, అనేక మెరుగులు దిద్ది, సర్ది, చక్కటి భాషలో చెప్పుకుని తృప్తిపడుతుంది: ఇంకా మరొకలలన తనకున్న ఇంగ్లీషువిజ్ఞానాన్ని (ఏపాటివున్నాను) వెల్లడిచేసుకుని, వారిలో తనకొక ప్రత్యేకస్థానం వున్నదనుకొని, చిన్నిగర్వంతో, లోలోనే, చిన్ని నిట్టూర్పు విడుస్తుంది. ఇలాగే ప్రతీస్త్రీ తనకు తోచిన విషయాన్ని చర్చిస్తూవుంటే, కాలం అతి వేగిరం గడిచిపోతుంది.

ఒకవీధిలోగాని, ఒక 'కాలనీ'లోగాని వున్న స్త్రీలందరూ ఒకచోటచేరి, సమస్తవిషయాలను చర్చించుకొంటూ, కట్టుగా, ఆనందంగా కాలక్షేపం చేయడం వాంఛనీయమే......కాని, యిటువంటి సమావేశాల్లో అప్పుడప్పుడు చిన్నకలహాలుకూడా వస్తూవుండడంకద్దు. అయితే, ఈ కలహాలు విషమ పరిస్థితులలోకి రాకుండా, ఓపెదిమె విరుపుతోనో, లేక బుగ్గలు నొక్కుకోవడంతోనో, లేక ఏమెటిక విరపుతోనో చప్పున చల్లారిపోయి, మళ్ళీ మర్నాటి సమావేశానికి భంగంకలుగకుండానే వుంటుంది.!

ఆడవారిలో కలహాలు ఎంతవేగిరం వస్తాయో, అంతవేగిరం చల్లారిపోతాయి, సాధారణంగా...... ఇంతకీ, ఈ చిన్న చిన్న పేచీలకు కారణం అట్టే కనిపించదు!! మచ్చుకి:

మొన్ననే, మాపొరుగువీధిలో చిత్రమైన ఓచిన్న పేచీ వచ్చిందట. (అని మాపొరుగుచిట్టి నాకు వార్త తెచ్చింది!) ఇంతకీ, అసలువిషయం ఏమిటయ్యా అంటే - ఓనాటి బాతాఖాని సమావేశంలో ఒకావిడ (పేరు, 'సంపూర్ణమ్మ' గారుట) ఏదో ఒక చిన్న ఇంగ్లీషుపదం వాడేరట. ఇంతట్లో, సరోజనమ్మగారు

అఇంగ్లీషుముక్కని సరిదిద్ది, 'కరెక్టు' చేశారట. దాంతో, ప్రారంభమైంది!! "నేను వాడిన పదం రైటు" అంటే "నాదేరైటు" అని కొంతసేపు వాగ్వివాదంఅయిందట. 'సభ' ముగిశాక, "సంపూర్ణమ్మ" గారు,సరోజనమ్మగారు, ఇళ్ళకువచ్చి భర్తలతో చెప్పి తీర్పునడిగారట. ఆభర్తలు తమభార్యల పక్షంలో తీర్పు చెప్పడమేకాక, మరిరెండేసి కొత్త ఇంగ్లీషు పదాలు వారికి నేర్పి, వాటిని మర్నాటి సభలో ప్రయోగించమన్నారట! మర్నాడు మళ్ళీ తాజాగా వాదన ప్రారంభమైంది......ఇంతలో' అక్కడే వున్న ఒక ముసలావిడ లేచి, "ఎందుకర్రా అలా వాదించుకుంటారు? మీకువచ్చిన వా రెండు ఇంగిలిపీచుముక్కలేగా! ఇంతాచేస్తే, మీయిద్దరిలో ఒక్కరైనా ఘట్టుఘారమైనా చదువలేదు! మీ మాతృభావనివదలి, అరాని భాషకోసం దెబ్బలాటేమిటీ... వూరుకొండిక!!" అని మందలించి, సంధి కుదిర్చిందట......కాని, అమర్నాడు, సంపూర్ణమ్మగారి భర్త, సరోజనమ్మగారి భర్త, రంగంలోకి దిగి, "నీ ఇంటర్మీడియేటు ఏపాటి?" అంటే "నీ B. A. ఏపాటి??" అని వాగ్యుద్ధం జరిపి మాటలు మానేసుకున్నారట.!!

యువతులలో ఈ "ఇంగ్లీషు" వెర్రి పోవాలి. తాము నేర్చిన ఏరెండు ఇంగ్లీషు పదములతోనో ఒకరి తప్పులనొకరు దిద్దుకో ప్రయత్నించడం అర్థంలేనిపని. ప్రాముఖ్యతలో మొదట తమ మాతృభాష తరువాత పైభాషలువచ్చునని సోదరీమణులు గుర్తించుకోవాలి, (అలాగని, ఇంగ్లీషులో పాండిత్యమున్న సోదరీమణులు ఆంగ్లసారస్వత చర్చలలో పాల్గొనకూడదని కాదు.)

ఇంక,-పిల్లలుగల స్త్రీలు మరివిచిత్రమైన సంభాషణలోకి దిగుతారు!

"మా పిల్లాడికి అప్పుడే మాటలువచ్చేశాయి" అని ఒకామె అంటుంది.-

"మా కుర్రాడికి కూడా మాటలు వచ్చును" అంటుంది, మరొకామె (తనపిల్లడి తక్కువేమిటి అంటూ!)

"బావుంది! మాపిల్లడు మీవాడికంటె చిన్నవాడు తెలుసా" - మొదటి ఆవిడ!

"కాదమ్మా! మా వాడేచిన్న...". - రెండో ఆవిడ!

ఇంక ప్రారంభమౌతుంది కయ్యం! ఇంతా చేస్తే వీళ్ల పిల్లాడికీ వాళ్ల పిల్లాడికీ వయస్సులో తేడా 15 రోజులుంటుందేమో! ఒక పిల్లడు "తాత, అత్త," అంటే, రెండవ పిల్లడు "అమ్మ, నాన్న" అంటాడు. అంతే! ఈ రెండేసి ముక్కలతోనే వారి పాండిత్యాన్ని వర్ణించడానికి పూనుకుంటారు వారి తల్లులు!! తమతమ పిల్లల గురించి ముచ్చటించుకోవడం సహజమే! కాని, అనూయలు కోపాలు కలిగేటట్లు, మరొకరి పిల్లలకంటె తమ పిల్లలే తెలివైనవారు, అందమైనవారు, బుద్ధిమంతులు, అని (నిజానికి అలాగ కాకపోయినాకూడ!) చెప్పుకోవడం కేవలం "vanity". 'కాకిపిల్ల కాకికి ముద్దు' అనేది మరువకూడదు.

ఇంక-పిల్లల పరాక్రమ శౌర్యాలగురించి స్త్రీలు చెప్పుకోవడం చాలావింతగా వుంటుంది! - ఓమారు 'సీతమ్మ'గారు తన 4 ఏళ్ళ కొడుకుతో సహా, 'సావిత్రి'మ్మగారి యింటికి వెళ్ళిందట. సావిత్రమ్మగారికికూడా ఒక 4 ఏళ్ళతనయుడు వున్నాడు. తల్లులిద్దరూ తమతమ పిల్లల ఆటల గురించి, చురుకుదనం గురించి మాట్లాడు కుంటున్నారు. పిల్లలిద్దరూ ఓ పందిరి మంచం ఎక్కి ఆడుకుంటున్నారు...

"మా గుంట వెధవ వూరన్ని ఆటలు ఆడతాడనుకుండీ!" - సీతమ్మగారు!

"మా వెధవో! అమ్మమ్మ!! ఏం చురుకుదనం! ఎప్పుడూ మంచాలెక్కి సునాయాసంగా కిందికి గెంతివేస్తాడు...".-సావిత్రమ్మగారు!

"అంతేనా! మావాడు చెట్లెక్కి దిగుతాడు... అయినా, బుద్ధిగా వుంటాడు, గుంటనాగమ్మ!!"

"ఆ మాటకివస్తే, మా వాడు మొన్న మా పెరట్లోని గన్నేరు చెట్టెక్కి కిందికి గెంతేశాడు!! మళ్ళీ, వాళ్ళనాన్ననిచూస్తే వూరంత గడగడ .." అంటూ, తన పిల్లడివైపు తిరిగి, "ఒరే! సానీ! ఏదీ చూతాం, ఆ మంచం మీంచి ఒక్క గెంతువేసి రా నా దగ్గరికి" అంది (ప్రత్యక్ష ప్రమాణం చూపడానికేమో!) ఆ పిల్లడుకూడా (తల్లిపోలికేమో!) నవ్వుతూ, ఒక్క వురుకున మంచం మీంచి గెంతబోయి, దబ్బున క్రింద పడ్డాడు ... సీతమ్మగారికి నవ్వు వచ్చింది! (అంటే, నవ్వొందన్నమాట!) ఆ నవ్వు చూచి, సావిత్రమ్మగారికి కంఠం వరకు కోపం వచ్చింది. - పిల్లడికి బుర్రమీద బొడిపె కట్టింది! సావిత్రమ్మగారు లేచి పిల్లడిని యెత్తుకొని, చరచరా వెళ్ళిపోయిందట!!

ఇంతకీ-కొందరు పిల్లలు ఎప్పుడూ నెమ్మదిగా వుంటారు; కొందరు గెంతుతూ అల్లరి చేస్తారు... కొందరు బుద్ధిగా కూచుని ఆడుకుంటారు; కొందరు త్వరగాను, కొందరు ఆలస్యంగాను మాటలాడ్డం ప్రారంభిస్తారు! వీటినిబట్టి వారియొక్క భవిష్యద్విజ్ఞాన శౌర్య పరాక్రమాలను నిర్ణయించి, అసూయలతో, మాతలు 'వీరమాత' లవడం (కయ్యాలలో!) అర్థంలేని పని!

సోదరీ మణులు తమ తీరిక సమయాలలో తమ విజ్ఞానాన్ని అభివృద్ధిచేసే విషయాలను చర్చించుకోవడం వాంఛనీయం ... ... స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యం, సంఘంలో ఆమెయొక్క స్థానం, రాజకీయాలు, దేశపరిస్థితులు, అల్లిక పనులు, కుట్టు పనులు, సంసారం చక్కబెట్టుకోవడం, గృహధర్మం, మొదలైన ముఖ్యవిషయాలను చర్చించుకోవడానికీ, ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకోడానికి, స్త్రీలకి ఎంతైనా అవసరంవుంది... నేడు సంఘంలో స్త్రీకి ప్రముఖస్థానంవుంది, లేదా, వుండాలి. ... గృహిణిగా, ఆమె తన గృహానికొక జ్యోతి! మాతగా, ఆమె ఒక దివ్యక్షమామూర్తి!

ఆంధ్ర సోదరీమణులు విజ్ఞానంలో, ధైర్యంలో, దేశభక్తిలో ముందంజవేసి, భారతదేశ స్త్రీలకి దివ్యజ్ఞాన జ్యోతులయి, మార్గదర్శకులయ్యేదినం కోసం మనం యెదురు చూద్దాము!

వఝల రామనరసింహమ్.

# రీటా తల వెండ్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగపనిచేయును. వేనవేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటావాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్టానిక్ కోరేవారికి రీటాను మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకో గలుగుతారు.

**సుశీల్కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తల వెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతము గుణమిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# సర్ జేమ్సు సిమ్సన్

## (SIR JAMES SIMPSON)

కె. నరసింహారావుగారు

సర్ జేమ్సు సిమ్సన్ (Sir James Simpson) జీవితచరిత్రను, ఆతడు క్లోరోఫారమ్ chloroform) లోని మత్తుగుణమును కనిపెట్టిన వివరాన్ని, నారీమణులందరూ తెలుసుకో తగిన విషయములలో నొకటి ! ఎందుచేతనంటే, మొట్టమొదట, కడుపుతోఉన్న ఆడవారికి క్లోరోఫారమ్ (chloroform) నిచ్చి, వారికి ఆపరేషన్ (operation) బాధ లేకుండా బిడ్డ చావకుండా బయటికితీసి, స్త్రీలోకమునకు మహోపకారంచేసినది ఈ విజ్ఞానే !

ఈ మహనీయుడు స్కాట్లండు దేశస్థుడు. ఈయన 1811 - సం॥లో, జూన్ నెల 7 వ తేదీని స్కాట్లండు దేశంలో బాత్ గేట్ లిన్ లిత్ గో (Bathgate Linlithgow) నగరంలో జన్మించాడు. కుటుంబంలో అందరికంటే చిన్నవాడు. ఈతనితండ్రి రొట్టెలవర్తకుడు. ఈయన పదునాల్గవయేట ఎడిన్ బర్గు (Edinburgh) విశ్వవిద్యాలయంలో కళాశాల విద్యార్థిగా ప్రవేశించాడు. రెండేండ్లతర్వాత వైద్యవిద్యనేర్చుకొనే విద్యార్థిగాచేరాడు ! వైద్యవిద్యనేర్చుకొనేరోజుల్లో ఒక ఆడమనిషికి, ఆపరేషన్ చేస్తూండగా చూచాడు. పాపం ! ఆ మనిషిని కాళ్లూచేతులూకట్టేసి, డాక్టరు కత్తితోటి కోస్తూంటే కాళ్లూచేతులూ గిజగిజతన్నుకుంటూ "బాబోయ్ ! బాబోయ్ !" అని ఆ మనిషి రోదనంచేస్తూంటే —జాలిగుండెకలవాడేమో!—ఆదృశ్యం చూడలేకపోయాడు.ఆరోజుల్లో ఆపరేషన్ అంటే అంత ఘోరంగా ఉండేదన్నమాట ! వెంటనే వైద్యవిద్యమీద విరక్తిపుట్టింది. కళాశాలను విడచిపెట్టి పోదాంఅనుకున్నాడట మొదట. కాని తిరిగి మళ్లా ఆలోచించుకొని, తాను కళాశాలను విడిచిపెడితే ప్రజలబాధలను తొలగించి ప్రపంచకానికి సేవచెయ్యడం జరగదనిన్నీ, ఆలాకాకుండా ఆపరేషన్ చేసేటప్పుడు రోగికి బాధలేకుండాఉండే ప్రతిక్రియ ఏదయినా కనిపెట్టాలని దృఢసంకల్పం చేసుకున్నాడు.

మరి నాలుగుసంవత్సరాలకి, వైద్యంలో బిరుదుపట్టాతీసుకొని, 1840 సం॥లో ఎడిన్ బర్గ్ (Edinburgh) విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ ఆఫ్ మెడిసిన్ ఆండ్ మిడ్ వైఫరీ ! (Proffessor of Medicine and Midwifery) క్రింద ఎన్నుకోబడ్డాడు. అంటే ఆస్పత్రిలో మందులశాఖకి, పురుళ్లశాఖకి అధికారిగా నియమింపబడ్డాడన్నమాట !

ఇలా ఉంటూఉండగా, 1846 సంవత్సరంలో, డాక్టరు రాబర్టు లిస్టన్ (Dr. Robert-Liston) అనే ఆయన సల్ఫ్యూరిక్ ఈథర్ (Sulphuric Ether) అనే పదార్థాన్ని మత్తు

మందుగా ఉపయోగించి, ఆపరేషన్ చెయ్యడం తటస్థించింది. కాని, ఈయనకు సల్ఫ్యూరిక్ ఈథర్ అంతమంచి మత్తుమందుకాదని, హానికరమయిందని అభిప్రాయంకల్గి, అప్పటినుంచీ దీనికిబదులుగా ఇంకొకటికనిపెట్టాలని పట్టుదలతో పనిచెయ్యడం మొదలు పెట్టి, 1847 సంIIలో క్లోరోఫారమ్ (chloroform) ను మత్తుమందుగా కనిపెట్టి, ప్రపంచానికి మహోపకారంచేశాడు. ఈయన క్లోరోఫారమ్ (chloroform) లో మత్తుమందు లక్షణాలను తెలుసుకొన్న చర్య చాలావిచిత్రంగా పుస్తకాలలో వ్రాయబడివుంది.

డాక్టర్. రాబర్టు లిస్టన్ (Dr. Robert Liston) చేసిన ఆపరేషన్ చూసినప్పటినుంచీ, ఏకదృష్టితోటి ఆవిరిగా మార్పుచెందే అనేక అరకులను ప్రోగుచేసి, ఒక్కొక్కదాని గుణాలను తెలుసుకోడం మొదలుపెట్టాడు.

ఒకరోజున, అనగా 1847 సంIIలో నవంబరునెల 4 వ తారీఖునాడు ఈ విజ్ఞానవేత్త విశ్వవిద్యాలయంనుంచి చాలాఆలస్యంగా ఇంటికివచ్చాడుట. చాలా అలిసివున్నాడట! పాపం! భోజనాలగదులలో తను, తన స్నేహితులయిన డాక్టర్ కీత్ (Dr. Keith), డాక్టర్ డంకన్ (Dr. Duncan), ముగ్గురూ కూర్చొని ఉన్నారుట. అలా కూర్చొని మాట్లాడుకుంటూండగా తను ప్రోగుచేసిన అరకులలో క్లోరోఫారమ్ అరకుజ్ఞాపకం వచ్చింది. వెంటనే దాన్ని పట్టుకురమ్మన్నాడు. అదెక్కడుందో తెలుసా? చెత్త సామానులు పారేసుకునే గదిలో కాగితాలచెత్తలో మునిగిఉంది. దాన్ని మొత్తం మీద ఎలాగయితేనే డాక్టర్ కీత్ (Dr. Keith), డాక్టర్ డంకన్ (Dr Duncan) గార్లు వెళ్లి పట్టుకొచ్చారు. ఈ ముగ్గురూ కూర్చొని సీసామూతతీసి, కొంచం కొంచం పీల్చడం మొదలెట్టారుట. మొదట పీలుస్తోంటే మాంచి తియ్యటివాసనవేసి, మహాసరదాగాను, సంతోషంగాను ఉందిట. చాలా బాగుందని ఇంకాపీల్చడం మొదలెట్టారుట. అలా మరి కొంచంపీల్చేసరికి సరదాఅంతాపోయి, ఏవో మిల్లుచప్పుళ్లు, రోదనశబ్దాలు, వినపడ్డం మొదలెట్టాయి. దానితోటి భయపడి అతనిస్నేహితులు పీల్చడం మానేశారుట. కాని డాక్టర్ సిమ్సన్ (Dr. Simpson) విడవకుండా యింకాపీల్చడం సాగనిచ్చాడుట. కొంచం సేపయేసరికి, ఏముందీ! తలకాయ బద్దలయిపోయినట్టయిపోయి, స్పృహ తప్పిపోయింది! చచ్చిపోయినవాడిలాగ పడుకుండిపోయాడుట పాపం! అతనిమిత్రులు కంగారుపడుతూ ఉపచారంచేశారు. మరికొంతసేపటికి తిరిగి తెలివొచ్చింది! తెలివిరావడంతోటే డాక్టర్ సిమ్సన్ (Dr Simpson)అన్నమాట! "ఈఅరకు సల్ఫ్యూరిక్ ఈథర్ (Sulphuric Ether)కంటె ఎక్కువ ఘాటయింది! దానికంటె మంచిది!" పరిశోధనలో నిమగ్నులయిపోతే మహానీయులకు అంతా ఆ దృష్టే! తరువాత తెలుసుకున్నాడు. తను నిస్త్రాణగా పడివుండటం తన స్నేహితులు గాభరాపడటం!

అది మొదలుకొని, చాలాసార్లు క్లోరోఫారమ్ (chloroform) గుణాలని తిరిగి ఋజువుచేసుకొని, ఆపరేషన్‌లో మత్తుమందుగాయివ్వడం ప్రారంభించాడు. మొట్టమొదట కడుపుతోవున్న ఆడవారికిక్లోరోఫారమ్(chloroform)నిచ్చి, వారికి ఆపరేషన్ బాధలేకుండా, బిడ్డచావకుండా బయటికితీసినది డాక్టర్ సిమ్‌సన్ (Dr. Simpson) మహనీయుడే. మొదట్లో అనేకమంది వ్యతిరేకాఅభిప్రాయాలు వెలిబుచ్చినా, విక్టోరియామహారాణికి క్లోరోఫారమ్‌నిచ్చి, ఆమెకు పురుడు బాధలేకుండా, సునాయసంగా వచ్చేటట్టు చేసినతర్వాత డాక్టర్ సిమ్‌సన్ (Dr. Simpson) క్లోరోఫారమ్‌ని మత్తుమందుగా ఇవ్వడం పద్ధతి ప్రపంచం అంతటా వ్యాపించి అతనికో అఖండఖ్యాతి నిచ్చింది!

శస్త్రచికిత్సకు ఆయువుపోసినవాడు ఈ మేధావిఅనే చెప్పొచ్చు! ఎందుచేతనంటే, క్లోరోఫారమ్‌ని మత్తుమందుగా ఉపయోగించడం మొదలెట్టిన తర్వాతనే, శస్త్రచికిత్స ఎక్కువ ప్రాముఖ్యంలోకివచ్చి, అనేకరకాల ఆపరేషన్లు చేయబడుతున్నాయి.

ఈతనివిజ్ఞానాన్ని కొనియాడుతూ వెస్టుమినిస్టర్ ఎబ్బే (West Minister Abbey)లో కట్టించిన ఈతని శిలావిగ్రహంక్రింద ఈమాదిరిగా చెక్కబడివుంది. "క్లోరోఫారమ్ (chloroform) ని మత్తుమందుగా ఉపయోగించడం కనిపెట్టి, ప్రపంచకానికి అందజేసి, ప్రజలబాధలను తొలగించిన మహాజ్ఞాని! దయామయుడు! సర్ జేమ్సు సిమ్‌సన్ (Sir James Simpson)!

# బాలప్రహ్లాద

## ౩ వ రంగము

### మాధవి, మల్లిక, ప్రవేశము

మ:- మాధవీ, అప్పుడే వచ్చేస్తున్నావు, కుమార ప్రభువుగారి అక్షరస్వీకారోత్సవం అయిపోయిందా?

మా:- అయిపోక యింకా ఉంటుందా? ప్రొద్దుటి నుంచీరాక ఎక్కడ నిద్రపోతున్నావు?

మ:- నిద్రపోలేదే. ఒకానొక అవసరకార్యముపై మహారాణీగారిచే నియుక్తనై ఒకచోటికి పంపబడ్డాను. అక్కడనుండి వెంటనే రావడానికి వీలుకాలేదు. అయ్యో సుముహూర్తం మించిపోతున్నదే, రాజకుమారుని అక్షరాభ్యాస మహోత్సవం కండ్లారచూడకపోతినే; అని ఎంతో ఆదుర్దాపడ్డాను, ఏమిచేయను? ప్రాప్తి లేదు. అయితే అక్షరాభ్యాస మహోత్సవం సలక్షణంగా జరిగిందా?

మా:- ఆఁ! విలక్షణంగా జరిగింది.

మ:- అదేమిటే వక్రోక్తులు.

మా:- నేనేవి చెప్పినా నీకు వక్రంగానే కనిపిస్తాయి.

మ:- అయితే బాగా జరగలేదా ఏమిటే?

మా:- అయితే చెప్పతున్నాను విను.

మ:- చెప్పూ.

మా:- మహారాజుగారు మహారాణీగారు బంగారు పీటలమీద కూర్చున్నారు, కుమార ప్రభువును మహారాజుగారు తొడలపై కూర్చోపెట్టుకున్నారు. మంగళవాయిద్యాలు మ్రోగినాయి. పురోహితులు మంత్రాలుచదివారు. ఆచార్యపుత్రులు చండామార్కుల వారుదయచేశారు. మహారాజావారు వారిని పసిడిపీటపై కూర్చుండబెట్టి కుమారప్రభువుచే ఆచార్యులవారికి సౌవర్ణ కౌశేయములు నవరత్నాభరణములు సమర్పింపజేసి నమస్కారం పెట్టించారు. గురుపుత్రులు రాజకుమారుని దీవించి సన్నిధిని కూర్చుండబెట్టుకొని "ఓం నమః శివాయ" అని అక్షరములు దిద్దబెట్టారు. ప్రహ్లాదకుమారుడు గురువు చెప్పిన ఆమాటలనకుండా 'ఓంనమోనారాయణాయ' అని ఉచ్చైస్స్వరంబున పల్కాడు. ఆమాటలు చెవినిబడగానే మహారాజావారి గుండె జారిపోయింది; కండ్లు జేవురించాయి; బొమలు ముడిపడ్డాయి. తత్క్షణమే ఆతామసమంతా కంఠగతంచేసుకుని, "ఆచార్యులువారు అనమన్నట్లు అనునాయనా"యని దీనంగా బ్రతిమలాడారు. ఆపిల్లవాని కదేమిధైర్యమో



గురువులు చెప్పిన షడాక్షరికి బదులుగా మూడు మార్లు "ఓం నమోనారాయణాయ" అని నారాయణ నామోచ్చారణమే చేశాడు.

ము:- మరొకడెవడైనా మహాప్రభువు సమక్షాన నారాయణ నామోచ్చారణ చేసినట్లైతే ఏమై యుండును?

మా:- తల తెగియుండును.

ము:- కన్నకడుపు ఏమిచేస్తారు? తరువాత మహారాజాగారేమి చేసినారు?

మా:- కుమారప్రభువును గురుమందిరానికి తోడ్కొని పోయి మహోత్సవమంతా ఆపివేసి ఏకాంత మందిరానికి వెళ్లిపోయినారు.

ము:- మహారాణీగారు?

మా:- కొమారునివల్ల పెనిమిటికే అపాయమో, పెనిమిటివల్ల కొమారునికే అపాయమో, అని కళవళపాటుతో కండ్లనీరు పెట్టుకున్నారు.

ము:- మాధవీ! ప్రహ్లాదకుమారుడిట్లా కేశవపక్షపాతి కావడానికి కారణమేమిటంటావు?

మా:- అమ్మగారు ప్రహ్లాదకుమారుని గర్భమందు ధరించిఉండగా అమాయలమారి జడదారి నారదుని ఆశ్రమంలో ఉండటమే ఈ ఆపత్తుకి కారణమనుకుంటాను. ఆ నారదుడు పరమభాగవతుడు, నారాయణచరణ సేవానిరతుడు. అనవరత శ్రీహరినామ సంకీర్తనా విలోలుడు, మరీ కలహాభోక్త, లీలావతి ప్రసవించగానే ఆబాలకుని యేమంత్రతంత్ర ప్రభావం చేతనో విష్ణుభక్తునిగా మార్చివేసి తండ్రీకొడుకుల మధ్య ఆగని వైరాగ్నిని ప్రజ్వలింపజేశాడు.

ము:- నిజమే; అంతే అయిఉండాలి. లేకపోతే శ్రీహరినామము విన్నంతనే 'శివ శివా' అని చెవులుమూసికొనే దానవకులంలో శ్రీహరి భక్తుడుదయించడమేమిటి? —(తెర)

# శిశువాఙ్మయకలాపం

డాక్టర్ పోలాకి శ్రీనివాసరావుగారు.



## ఉ ౧

## చందమామ

అంతు సుంత చాలని
ఆకాశపు వీధిని
అందముగల చందమామ
ఉంది కనుల విందుగా

తారలు తన సరస నుండి
తళుకు తళుకు లాడినాయి
హాయి ! హాయి ! హాయి !

సరసున గల కలువలు తమ
బరువు తలలు నిలువు గాను
నిలిపి విడిసి ఘుమ ఘుము యను
సలలిత వాసనలు కురిసి
తామరలను పరిహాసించి
తనివి దీర కులికి నాయి
హాయి ! హాయి ! హాయి !

## ఊ ౨

## సుమ వనము

వాసన గలిగిన పూవులు పూచి
వంకర టింకర లతలను గలిగి
ఎగిరి తిరుగు తూనీగలు గలిగి
కూకూ పక్షుల కూతలు గలిగి
మందము మారుత హాయిని గూరిచి
అందము చూపిన దీ వనమూ
ఆనందపు రంగుల సుమ వనము.



# లోకవార్తలు



హాలీవుడ్‌నందు పోలీసులు ఒకమగస్టారును ముగ్గురు ఆడస్టారులను అరెస్టుచేశారు. ప్రభుత్వపుటుత్తరువుల నుల్లంఘించి త్రాగరాని పానీయం త్రాగినారని వారిపై నేరముమోపినారు. వారిలో నొకామె కేవలమట్లా ఇతరులు పానీయం త్రాగుచుండగా వారి సాంగత్యమున నున్నదని యే నేరము. అందు నటుడున్ను మరి ఇద్దరు తారలున్నూ చేరి 1000 డాలర్లు ధరావతుకట్టి జామీనుమీద విడుదలైనారు,

* * *

కల్నల్ ఉన్నినాయర్ అమెరికాలో భారతీయరాయబారి ఆఫీసులో పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు. ఆయన భార్య డాక్టరు విమల. వారికి ఈ 2 వ తేదిరాత్రి ఆడశిశువు జన్మించినది. నూతనచట్టానుసారం పౌరసత్వపుహక్కులు సంపాదించిన ప్రథమ భారతీయ శిశువు ఈమెయే. వెంటనే ఆశిశువును రిజిస్టరు చేసినారు. ఆమెకు 21 సం॥ లు వచ్చినతర్వాత భారతీయ పౌరసత్వముకోరునో, అమెరికన్ పౌరసత్వము కోరునో ఆమె నిర్ణయించుకోవలసియుండును.

* * *

రిచర్డుమారో వైయిట్‌సతి బిడ్డతల్లి. ఆమెకు 1946 నుండి విమానయానమున ఆసక్తికలిగినది. ఈ ఆగస్టు 18 వ తేదిన ఆమె-రెండు సీట్లుగల విమానములో ప్రపంచమంతా ఒక్కసారి చుట్టివత్తామని బయలుదేరింది. దారిలో - మార్శిల్స్, మాల్టా, నికోస్టా, హాబేనియా, బాహ్రెయిన్, షార్జీలలో దిగుతూ ఈ నెల 3 వ తేదిన కరాచీకి చేరుకున్నది. ఢిల్లికివెళ్లి తిర్గి ప్రయాణం సాగిస్తుందట. తోడుగా మరోవిమానమంపుతామని ఎంతమందిచెప్పినా వద్దంటున్నదీ సాహసికురాలు. జపానునుండి అలూషియన్ దీవులకు - ఏకటాకీన వంటరిగా పసిఫిక్ సముద్రమును లంఘించవలయునని ఆమెయత్నం. లండన్ విడిచినతర్వాత మొత్తముమీద 40 గంటలు అంతరిక్షాన ఉండినది. ఇంకా 160 గం॥ లు ఇట్లాగే (ఆగుతూ, ఆగుతూ) అంతరిక్షంలో విమానంలోగడచి - అక్టోబరు ప్రథమవారంలో కేంబ్రిడ్జి చేరుకుందామని ఆమెకోరిక. ఢిల్లీ, కలకత్తా రంగూన్, భాంగాక్, సైగన్, జపాన్, - పసిఫిక్‌సముద్రం దాటి ఉత్తరఅమెరికా, అక్కడనుండి లండన్, చేరవలయునట. ఈలాంటి యత్నారంభమునకు ఈమెయే మొదటిది.

* * *

హాలెండులో డచ్చి సామ్రాజ్యమునకు రాణియై 50॥ సం॥ లు పరిపాలించిన విల్‌హెల్మినారాణి

రాజ్యము తనకుమార్తె కప్పగించి తాను సింహాసనమునుండి తొలగినది. ఆమెకుమార్తె జూలియనా రాజ్యాధికారము వహించినది.

*                    *                    *

యడిత్ లిటిల్‌టన్ దొరసాని 83 వ ఏట చనిపోయినది. (2-9-48). జినివాలో లీగ్ ఆఫ్ నేషన్స్ సమావేశములకు బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధిగా 5 సార్లు వెళ్లినది. గ్రంథాలువ్రాసినది. ఆమె వ్రాతల్లో కలలు జరుగబోయ్యేవానికి సూచనలు అనేది ఒక ముఖ్యాంశము.

*                    *                    *

బ్రస్సల్‌లో ఒక స్త్రీకి మెదడు శాస్త్రచికిత్స చేశారు. ఆ శస్త్రంచేసిన అమెరికన్ డాక్టరు ప్రొ. వాల్టర్ ఫ్రీమెన్ - ఆమె కనుగ్రుడ్లు ఊడదీసి - ఆ గుంటలలోనుండి మెదడు శస్త్రంచేశాడు. మామూలుగా ఇలాంటి శస్త్రచికిత్స చేశేటప్పుడు క్లోరోఫారం అనేమత్తుమందిచ్చేవారు. కాని ఈమెను డాక్టరు విద్యుచ్ఛక్తి స్పర్శతో స్తబ్ధురాలినిచేసి-శస్త్రంచేశాడు. ఈ రెండువింతలు గావించిన మొదటి వైద్యుడితడే.

*                    *                    *

భారతయూనియన్ ప్రభుత్వం ఒక కోటి రూపాయలు ఖర్చుపెట్టి పెన్సిలిన్ అనేసంజీవిని ఉరవుగా ఉత్పత్తిచేసేయంత్రం నెలకొల్పుచున్నారు. దానిలో బాగాపనిసాగేసరికి రోజుకు 100,00,00,000 మోతాదు లుత్పత్తి అవుతాయి. అంటే-ప్రతీ అంగట్లో వాము, కరక్కాయవలె దొరకాలి.




సర్. సి. పి. రామస్వామిఅయ్యర్‌గారు ఇటీవల అమెరికాఖండమునకు వెళ్లివచ్చి తన అనుభవము నిట్లు తెల్పిరి:—

"పాశ్చాత్యదేశాల యాంత్రికనాగరికత మానవలోకానికి సంతృప్తికలుగజేయ జాలకపోయినది. అమెరికాలో నిత్యకృత్యజీవనముయొక్క అంతస్థు ఉన్నతమైనది, అయితే అక్కడిజనము శాంతము స్థిమితముకోరుచున్నారు. గాంధీమరణానంతరము అమెరికా ఆయనను శిరసావహిస్తున్నది. భారతదేశం మరచినా, ఆయనను, అమెరికా మరువజాలదు."

మద్రాసులో 'జయలక్ష్మీపురం' అనే పేదవారి గుడిసెలున్న ప్రదేశమును గవర్నరు సతి (నై) దర్శించి చెప్పిన ఈ క్రింది శుభవాక్యములు బంగళాలలోను, కాలీస్థలముగల పెద్దఇండ్లలోను నివసించు విద్యావంతురాండ్రును గమనింపదగినవి:—

"ఈ జయలక్ష్మీపురంలో లయోలా కాలేజీ సోషల్ సర్వీస్ లీగువారు 'గావించిన కృషి ప్రశంసింపదగినది. పరిశుభ్రమైన ఈ గుడిశలప్రదేశముచూడ ముచ్చటవేస్తున్నది. ఈ గుడిసెలలో నివసించేవారు వానిచుట్టు ఆకుకూరలు, కాయగూరలు శ్రద్ధగా పెంచడం ఎన్నదగినది."

అన్నామలై విశ్వవిద్యాలయోపాధ్యాయులగు ప్రొ. రత్నస్వామిగారు 41 సం॥ల క్రిందట లండనులో చదువుకొని వచ్చియున్నారు. తిరిగి వా రిటీవల లండన్ వెళ్లిరి. వారి అనుభవములనుగూర్చి హిందూపత్రికలో వ్రాసిరి. అందు వా రిట్లనిరి:—

"లండన్ వీధులలో నడిచేటప్పుడు, నాకు మొట్టమొదట తట్టిన విషయం, అక్కడ స్త్రీపురుషులు పుష్టిగాఉండడం. వాళ్లకు తినడానికి బలకరమైన ఆహారమున్నట్లు కన్పించారు; వాళ్లలో తెగతిన్నవాళ్లు, కొవ్వుబలిసినవాళ్లు నాకెవ్వరు కన్పించలేదు. అందులో ముఖ్యంగా చిన్నపిల్లలు ఎముకపుష్టికల్గి, సన్నగాను బలంగాను ఉన్నారు. ఇది ఇంగ్లీషువారి రేషనింగు పద్ధతిప్రభావము. ఆ పద్ధతిననుసరించి పెద్దవాళ్లకు అవసరమైనంతే సరఫరా, పిల్లలకు ఆరోగ్యంగా ఎదగడానికి అవసరమైనంతా ఇస్తారు.

ప్రత్యేకముగా స్త్రీలనుగూర్చి ఇట్లన్నారు:—

మధ్యతరగతిలో క్రింది శ్రేణికిచెందినవారు, కార్మికులుఅయిన స్త్రీలు బాలికలు-పూర్వాంకన్నా వంటినిండాగుడ్డ, తలకుటోపీ, కాలికిజోడు ధరించి తిరుగుతున్నారు. ఈ రోజులలో బాలికగాని, స్త్రీగాని నోరు విప్పనంతసేపు-సామాన్యులో పైతరగతులవారో చెప్పసాధ్యంగాదు, నోరుకదిపితేమాత్రం మాటయాసనుబట్టి

ఏ తరగతికి చెందినదో చెప్పవచ్చు; పూర్వపురోజుల్లో దాదాపు లేదనే చెప్పవచ్చు; ఇప్పుడు పెదిమలకు రంగు వేసుకోవడం, కనుబొమ్మలు, గట్రా సరిదిద్దుకోవడం విస్తారమైంది; అయితే ఇక్కడ మనదేశంలో నవనాగరికపు స్త్రీలకంటె తక్కువగానే అక్కడి పైతరగతి స్త్రీలు వీని నవలంబిస్తున్నారు. కాని స్త్రీలు ఎందుకు, ఎందుకో, అంతగా పొగత్రాగుతున్నారు? పురుషులు పూర్వమంతగా పొగత్రాగడంలేదు. సిగరెట్లు ప్రియం. ఇప్పుడు కుటుంబంలో ఒకరికన్నా హెచ్చుగా పొగత్రాగ నవకాశంలేదు; అదేకాబోలు దానికి కారణం? మరి, ఇంగ్లాండులో యథాప్రకారంగా, పురుషులు, స్త్రీలకు సావకాశమిచ్చి తాము తొలగుతున్నారు."

మద్రాసుశాసనసభల సంయుక్తసమావేశమున గవర్నరు వీడ్కోలు ఉపన్యాసమిచ్చినప్పుడు గవర్నరుదంపతుల నభినందిస్తూ కౌన్సిలుఅధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారిట్లు అన్నారు:—

తామున్నూ, తమ సతీమణియున్నూ, బహుశా ఇదివరలోవచ్చిన ఏ గవర్నర్‌దంపతులకన్నా, విశేషంగా రాష్ట్రవాసులహృదయం చూరగొన్నారు. తమకేలాటి న్యూనతభావించకుండా మరోమాటా అంటాను. మైసతి, తమకన్నా ముందడుగువేసినది. ఆమె రాష్ట్రప్రజలకు, ముఖ్యముగా స్త్రీలకు ప్రేమాస్పదురాలైనది."

యతిరాజ్ యువతీ కళాశాలలో విద్యార్థినులస్వాగతము స్వీకరించి భారత యూనియన్ గవర్నర్ జనరల్ శ్రీ రాజాజీగారిట్లు పల్కిరి:—

విజ్ఞానసంపాదనమే పరమావధి కాదని యువతులు గ్రహించవలెను. అవసరమైనంత కనీసజ్ఞానము సంపాదించితిమని తృప్తికలుగగానే వారు వివాహముచేసుకొని సంసారము సర్దుకోవలయును.

శాంతిసంరక్షణగోరు ప్రపంచవిజ్ఞానులసభవారు ప్రపంచంలో నేడుండే స్థితిగతుల గూర్చి ఈ క్రిందివిధంగా ప్రకటనచేశారు:—

ఇటీవలనే ప్రజాప్రాతినిధ్య శక్తులన్నిచేరి, అపారమైన త్యాగములుచేసి, ప్రజలు అష్టకష్టాలు అనుభవించగా తుదకు మానవవిజ్ఞానం నశించకుండా కాపాడారు. అయితే అన్నిదేశాలప్రజల ఆశయాలు, అభీష్టము లెక్కపెట్టకుండా, అమెరికాలోను యూరపులోను స్వార్థపరులు పిడికెడుమందిచేరి తిరిగీ ప్రపంచాన్ని యుద్ధంలోకి దించాలని చూస్తూన్నారు; వీరు ఆ ఫాసిస్టుతత్త్వమునుండి, జాత్యాధిక్యత, అభివృద్ధి విముఖత, ఆయుధబలంతో తగాదాలు పరిష్కారంచేసుకోడం-అనే ఆదర్శాలన్నింటిని సంక్రమింపజేసుకొన్నారు. కొందరిని రంగుజాతులని పేరుపెట్టి-ఆ జాతులను మొత్తంగా అణగద్రొక్కడం ఇంకా సాగుతూనే ఉన్నది; మరీ యెక్కువైందికూడా. తమదేశాలలో ఉన్నతాదర్శాలకై పాటుపడేవారినికూడా వేధిస్తున్నారు. ఇదంతా సబబుకాదు. క్రొత్తగా కనిపెట్టబడిన శాస్త్రవిశేషాలను—మానవసౌఖ్యానికుపయోగించేబదులు రహస్యంగా మారణయంత్రాలను సృష్టించడానికుపయోగిస్తున్నారు. ఇది శాస్త్రము యొక్క ఉన్నతాదర్శాన్ని తప్పుదారికీలాగడం. శాస్త్రజ్ఞానమును విధ్వంసకచర్యల కుపయోగించడం నిరసిస్తున్నాము. శాస్త్రజ్ఞానము ప్రపంచమంతటా ప్రచారమై, తద్వారా, దారిద్ర్యము, అజ్ఞానము, రోగము, అవసరము,—ప్రజాబాహుళ్యానికి నివారణకాగలందులకు ప్రజలంతా సర్వశక్తులా కృషి చేయాలి.

యతిరాజు యువతీకళాశాలకువెళ్ళి, పీడోల్కాలుబడసి గవర్నరునైనసతి అచటి విద్యార్థినులకు గావించిన హితోపదేశము:—

"బాగుగా చదువుకున్న యువతులు ప్రజాహితకరమగు కార్యములన్నింటియందును ముఖ్యస్థానములను వహింపవలయును. "నేను చదువుకున్నాను; చదువుకున్న పెండ్లాముగా భగవంతుడు నాకు ప్రసాదించిన, శక్తిజ్ఞానము, మీరుగౌరవించాలి" అనిప్రతి చదువుకున్నపెళ్లాము-తనభర్తతో చెప్పాలి. వివాహానికి ముందే, మీ భర్తలతో ఇలా చెప్పివేయండి. "చదువుకున్న యువతికి వంటచేయడమేకాదు; వాఙ్మయము, చరిత్రకూడా వచ్చు; ప్రపంచవ్యవహారాలూ తెలుసు; ఈ కాలంలో తెలియవలసినవి, ఆచరణకవసరమైనవి అన్ని సంగతులు నేర్చుకున్నది." అని మీ భర్తలు మిమ్ములను ఎందుకూ పనికిరానివాళ్లుగాచూడడం నేను ఇష్టపడను. మీరుఊరకే ఈ డిగ్రీలు పొందడంలేదు. మీరు తెలివైనవాళ్లు, విశేషంగా చదువుతున్నారు; అన్ని విషయాలలో ఆ శక్తిఉన్నది; వాటన్నిటినీ బాగా తెలుసుకుంటున్నారు."

# సువర్ణమాల

సువర్ణలతా పిక్చర్సు లిమిటెడ్‌వారు తాము తయారు చేయించిన 'సువర్ణమాల' అనే చిత్రపు ట్రేడ్ షోకు "గృహలక్ష్మి"ని ఆహ్వానించి సందర్శించు అవకాశమిచ్చినందులకు వారికి కృతజ్ఞులము. ఇంగ్లండువెళ్లి పెద్దపరీక్షలిచ్చివచ్చిన యువతీ యువకులిద్దరు స్టీమరుమీద పరస్పర పరిచయం చేసుకుంటారు. ప్రథమపరిచయంలోనే వారికి అన్యోన్యానురాగం మొలకెత్తి తీగలు సాగుతుంది. కాని వారి వివాహానికి చాలాకాలం దైవికమానుషాభ్యంతరాలెన్నోకల్గి - చివరకు వారు దంపతులవుతారు. ఇదీ అసలు కథ. ఇక ఆమె తండ్రి ఆమెను మరొకరికివ్వబోవడం, ఆమె ఇష్టపడక ఇల్లు విడిచి పోవడం, దారిలో కష్టాలు, ఆ యువకుడు ఉద్యోగం దొరకక గజదొంగ కావడం - ఆ అమ్మాయి తండ్రిచే తిరస్కృతుడై గ్రామాంతరం వెళ్లడం-ఉద్యోగస్థుడు సంపాద్యపరుడు కావడం - తుదకు వారుభయులు అక్కడ కలుసుకోవడం-తండ్రి సమ్మతి మీదే వివాహం - ఇవి అంతర్గాథలు. ఈ రోజులలో కథలో లోటు, సవరించిన డైరెక్టరుదో, అసలు కథకునితో చెప్పడంకష్టం. విద్యాధికురాలైన యువతి సామాన్యపురుషులను ఆజ్ఞాపించగల్గి ఉంటుంది; కాని ఇందులో రోహిణి అన్యథా చిత్రింపబడినది. ఉద్యోగం దొరకని సుధాకర్‌ను గజదొంగను చేయడంలో అందంఉంది. ఈ ఉభయ పాత్రలుధరించిన బాలసరస్వతీదేవిన్నీ, సూర్యనారాయణగారున్నూ తమతమ పాత్రలను బాగానే నటించినారు. అమ్మాయి తండ్రిలింగమూర్తిగారు ఇలాంటి వేషాలు గుత్తకుచ్చుకున్నారుగదా. వారి సంగతి చెప్పనక్కరలేదు. తెలుగు సాంఘిక చిత్రాలన్నిటిలోవలెనే, - ఒక తోడపెళ్లికూతురు, ఒక సాధువు, ఒక పడుచు పెళ్లాం, ముసలి మగడు, మొదలైనవన్ని ఇందులోనూ ఉన్నవి. ముసలిమగడైన వంటవానివేషధారి-రాళ్లపల్లి నటేశం - షష్ఠిగడిచినా - కరక్కాయవలె అలాగే వున్నాడు. ఆ చలాకీ, ఆ నటనా సామర్థ్యం ఏమీ జంకలేదు. అసలాయన, పలుకు, కులుకు హాస్యమొలికిస్తుంటాయి. ముసలి మగడుగా వంటవాడుగా బాగానటించాడు. సంగీతము, ఛాయాగ్రహణము, శబ్దగ్రహణముకూడ లోటు కన్పించడంలేదు. కాని కథలో నవ్యతగాని, గజదొంగ చర్యలుతప్ప ప్రజాసామాన్యము నుద్రేకపరచి ఆశ్చర్యంగొల్పే సన్నివేశాలుగాని కన్పింపవు. ఇంకా మనసాంఘిక చిత్రాలు కేవలం-వివాహాన్ని అంటిపెట్టుకొన్న భావప్రపంచాన్ని వదలి - నిత్యకృత్యంలో మానవులను సహస్రముఖాల ఎదుర్కొనే అనంతసమస్యల వంకకు మరలలేదు. అయితే పురాణయుగంలోనుండి సాంఘిక రంగంలోకి మాత్రము క్రమంగా మారుతున్నది: మారిందనే అనవచ్చు. సువర్ణలతా పిక్చర్సువారు మరికొంతశ్రద్ధ వహించి రానురాను ఉత్తమోత్తమమైన సాంఘిక చిత్రాలు తీయగలరనే ఆశకీ "సువర్ణమాల" అంకురం అనిపిస్తున్నది.

# సంపాదకీయములు

## మద్యనిషేధప్రచారము

మద్యనిషేధప్రచారమునకై అధికారేతరులను నియమించుటకు ప్రభుత్వము ఆలోచించుచున్నట్లు మంత్రి గురుపాదంగారు శాసనసభలో నుడివియున్నారు. ఇది సమ్మతింపదగిన విషయమే. అయితే ఈ ప్రచారకులుగా పదవులకై ప్రాకులాడు కాంగ్రెసువాదులగు మగవారినేర్పరచి కత్తులనెంచక- స్త్రీలను, అర్హురాండ్రను ఏర్పరచుట న్యాయము. వీరు త్రాగుబోతులకు చక్కగా ప్రచారముచేయవీలగును. మరియు మగవాడు త్రాగివచ్చినచో బాధపడునది స్త్రీ. ఆమె తగినసహాయము, సలహాయున్నచో తన భర్తను మద్యపానవిముఖు నొనర్పగలదు. ప్రభుత్వమును, శిక్షాస్మృతితో వెన్నుతన్నియున్నచో నయమునను భయమునను ఈ ప్రచారము సఫలితము నీయగలదు. మరియు నీత్రాగుబోతులు త్రాగియున్నప్పుడు దురుసుగా నుండవచ్చునుగాని—వట్టియప్పుడు చాలసాధువు లనదెల్లును.' అప్పుడు అధికారయుతమగు పురుషుని బోధలకన్నను, సానునయపూర్వకమగు స్త్రీలబోధనలు వారిహృదయమునకెక్కును. మరియు స్త్రీలైనచో-త్రాగుబోతుల జీతనాతములు వారిభార్యలను వెంటబెట్టుకొనివెళ్లి, వారిచేతిలోబడునట్లు చూచుటకును దానికితగిన తినుబండారములు వారుకొనునట్లు ఏర్పాటుచేయుటకును వీలగును. త్రాగుబోతుల గృహిణులతోకలిసి కృషిచేసినగాని త్రాగుబోతుల మాన్పింప తరముగాదు. ఆ పని స్త్రీలకెక్కువవీలు. కావున ఈ ప్రచారకుల నందరను కాకున్న మానె, పలువురినైన స్త్రీలనేర్పరచుట సబబు.

## కీ. శే. వెంకటగిరి మహారాజ మాతృశ్రీ

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారి మాతృశ్రీ ఆగస్టు మాసాంతమున కీర్తిశేషురాలైనదని వినుట కెంతయు చింతిల్లుచున్నాము. వేంకటగిరి సంస్థానము అతిప్రాచీనమగు వెలమ సంస్థానము. వేంకటగిరి ప్రభువులు, రాణులు దాననిరతులు ; దయాధర్మపరులు. శ్రీ మహారాజమాత అంతమముందు 40 రోజుల క్రితము పూజామందిరమున హారతిజ్వాల చీరకంటుకొని వళ్లుగాలి ఆ బొబ్బలఫలితముగా శ్రీరామనామోచ్చారణ మొనర్చుచు స్వర్గారోహణ మొనర్చిరట. అదేమి దైవనిర్ణయమో శ్రీ శ్రీ సీతికాపురాధీశ్వరుని ప్రథమపత్ని చిన్నమాంబదేవిగారును సరిగనిట్లే – కీర్తిశేషులైరి. శ్రీ వేంకటగిరి మహరాజమాతగారు పూజాపునస్కారములందును, బీదల కన్నదానమునందును విశేషముగ నాసక్తిగల్లవారని తెలియుచున్నది. ఈ కరవుకాలమున తమ ఆకలిబాపుచుండిన అన్నపూర్ణాదేవి అంతరించినందులకా పేదలు ఎంత కటకట పడుచున్నారో ! మాతృశ్రీనిగోల్పోయిన శ్రీ వేంకటగిరి మహారాజులుంగారికిని, వారిసోదరులకును, వారి ఏకైక పుత్రికకును మా హృదయపూర్వకమైన సానుభూతి తెల్పుచున్నాము.

## వయోజనని యోజక వర్గపు జాబితాలు

రాగల రాజ్యాంగము చిత్తుచట్టమునందు వయస్సువచ్చిన స్త్రీ పురుషులందరికీ ఓటు ఇచ్చేహక్కు ఏర్పరుపబడినది. ప్రజాయత్త ప్రభుత్వాధికారమేర్పడుటకు అదేముఖ్యమైన ప్రాతిపదిక. ఇందుకను గుణ్యంగా ఓటర్లజాబితాల నేర్పరచుటకు అక్టోబరు 8, 9 తేదుల నేర్పరచినారు. ఆరెండు రోజులలో రాష్ట్రమంతటా వకేసారి జాబితాలు తయారుచేస్తారట. వయసువచ్చిన వారంతా ఈ హక్కు సంపాదించవలె. స్త్రీలున్నూ, పురుషులతోపాటు తమ పేర్లను సంపూర్ణముగా నమోదుచేయించు కోవలె. ఇందుకుగాను ఇప్పటినుంచే గ్రామాలలోను పట్నాలలోను తగిన ప్రబోధముజరిపి స్త్రీలందరు సిగ్గుపడక, జంకులేక జాబితాలలో తమపేరుచెప్పి చేర్పించుకొనేట్లు చూడవలెను. ప్రభుత్వమున్నూ యున్యూమరేటర్లు గా కొందరు స్త్రీల నేర్పరచుటమంచిది. ఈ రోజులలో ప్రభుత్వముచేసే చట్టాలలో పురుషులతోపాటు స్త్రీలకున్నూ చెందనివని యేమీలేవు. కావునవారు రాజ్యాధిపత్యనిర్ణయములో సంపూర్ణమైన సమానమైన బాధ్యత వహించాలి. అందుకు ఓటర్లజాబితాలలో వయస్సువచ్చిన స్త్రీ లంతా నమోదుకావడం ముఖ్యము.

## పాలు

ఆహారము మనుష్యులకుగాని, జంతువులకుగాని పుష్టికరమైనదై యుండవలయును. మనుష్యాహారము సంపూర్ణముగా పుష్టికరమైనదికావలెనంటే పాలు అందొక్కభాగముగా అమరవలయునని అర్ ్క్రాడ్ మున్నగు శాస్త్రజ్ఞులు నుడివియున్నారు. అయితే మనదేశమున అన్నికరువులతో పాటు పాడికరువు ఏర్పడి యున్నది. న్యూజిలాండుదేశమున సగటున తల 1 కి 50 ఔన్సులకుపైగా పాలుత్రాగుచుండగా మన దేశమున తల 1 కి 4 లేక 5 ఔన్సులకన్న హెచ్చుపాలు పుచ్చుకొనుటలేదని రివిన్యూమంత్రి వెంకట్రావు గారు నుడువుచున్నారు. ఈ దుస్థితినుండి మనము అభివృద్ధిగాంచవలయును. దేశమునపాడి అభివృద్ధి గాంచుచో తల్లులకు పిల్లలపెంపక మొక సమస్య కాజాలదు. ప్రతినిత్యము పాల్గారగించు తల్లి బిడ్డకు పుష్కలముగా పాలివ్వగలదు. తల్లిపాలు త్రాగుపిల్లలు ఆరోగ్యవంతులగుదురు. తల్లిపాలు నిల్పివేసినపిదప మరికొన్ని సంవత్సరములు పిల్లలకు పశువులపాలైన లభ్యమగుచో వారి ఆరోగ్యము సంరక్షితమగును. దేహదార్ఢ్యము చేకూరును. కావున ప్రభుత్వమును పాడి సమృద్ధికి వలయు ఏర్పాట్లన్నియు చేయవలయును. ప్రజలు వారిని౦దుకు తోడ్పడరించవలయును. ముఖ్యముగా స్త్రీలు ఈ సమస్యను చేపట్టవలయును.

## ప్రపంచశాంతి

ప్రపంచశాంతి సంరక్షణకై వివిధదేశముల విజ్ఞానధనులుకలిసి గావించిన ప్రకటన వేరొకచో ప్రచురించియున్నాము. నిజంగా ప్రజలకు ఆనోన్నద కాలుకల్పించి, అవసరాలుతీర్చి, ఆనందము చేకూర్చ సాధనాలైన శాస్త్రవిశేషాలను మారణసాధనోత్పత్తికై వినియోగించడం దారుణం. కల్పతరువును కట్టెలకై కొట్టినట్లు. కాబట్టి ఈ విజ్ఞప్తితో ఏకీభవించనివారు ప్రపంచంలో బహుకొద్దిమందే; ముఖ్యంగా శాంతి ప్రియులైన స్త్రీలందరూ వీరితో ఏకీభవిస్తారు. ఏకీభవించడంజాలదు. అందుకై కృషిచేయాలి. సగం జనాభా అయిన స్త్రీలు కృషిచేసిననాడు ఏ కార్యం నెరవేరదు? కాబట్టి ఈ విజ్ఞప్తిలోని సంగతులు అమలు జరుగవలెనంటే-అది స్త్రీలపై ఆధారపడిఉన్నది. వారు భవిష్యత్సంతులను ఈ భావాలతో పెంచినట్లైతే కనీసం—రాగల సంతతివారైనా బాగుపడతారు.

## అనుకరిస్తారో, గ్రహిస్తారో?

బ్రిటను లో యుద్ధకాలంలో ప్రారంభమైన రేషనింగుపద్ధతి ఇంకా అంతంకాలేదు—హెచ్చుఉత్పత్తి చేసి కోరికలుచంపుకొని ఎగుమతులు పెంచి, కడుపుకట్టుకొనైనా, దిగుమతులు తగ్గించి దేశీయార్థికసౌష్టవమును సాధించవలెనని బ్రిటిష్‌వాళ్లు తంటాలుపడుచున్నారు. అయితే కొందరు గృహలక్ష్ములకీ ఎడతెగని రేషను పద్ధతి విసుగువేస్తున్నది. ప్రభుత్వమువారు తమకుతామే దీనినితీసివేసేపద్ధతి కన్పించడంలేదు. అందుచేత బ్రిటిష్ గృహలక్ష్ములే ఈ విషయం పార్లమెంటుకు, ప్రభుత్వానికి హెచ్చరికచేయదలచుకున్నారు. అక్కడ బ్రిటిష్ గృహలక్ష్ములసంఘము ఒకటిఉన్నది. దానితరఫున బ్రిటిష్ దీవుల నలువైపులనుండి ఇల్లాండ్రు లండను వస్తారు. ఈ14వతేది జరుగబోయే—పార్లమెంటుసమావేశంలో ప్రేక్షకుల స్థానాలలో 150మంది గృహిణులు క్రిక్కిరిసి కూర్చొని పార్లమెంటుసభ్యులకు — రేషను పరిమితి హెచ్చుచేయవలసిన అవసరం హెచ్చరికచేయనున్నారు. ఆ పైనమీటింగులు చేసి తీర్మానాలుచేస్తున్నారు. ఈ విషయం భారతీయ గృహలక్ష్ములు, అనుకరిస్తారో, గ్రహిస్తారో ?

## బహుభార్యా నిషేధము — విడాకుల కనుమతిచట్టం.

శ్రీ కాశేశ్వరరావు పంతులుగారు మద్రాసుశాసనసభలో ఈ విషయమై తెచ్చినబిల్లు మూడవ సారియు చర్చజరిగినది; ముగింపుమాత్రము కాలేదు. శ్రీ కాశేశ్వరరావుగారిబిల్లులో బహుభార్యానిషేధమే ప్రధానహంశము. వాస్తవమునకు బహుభర్తృనిషేధము కూడా ఈ బిల్లునం దుదహరింపబడెనుగాని అది మన రాష్ట్రమున కేవలము మృగ్యము. బహుభార్యానిషేధమున కుపాంగముగా విడాకులకనుమతికూడ ఇందు చేర్చబడినది. బహుభార్యాత్వము సామాన్యముగా దూష్యము, అది స్త్రీలక్షేమమునకు భంగకరము. కాని బహుభార్యాత్వమునకు ఒకొక్కప్పుడు న్యాయముగా అవసరముండును అనేవారిని కాదనజాలము. అందులోముఖ్యమైనది సంతానరాహిత్యము అని వారంటారు. సంతానమును కని ఎత్తిపెంచవలయునని ప్రతిప్రాణికి సహజమైనకోరిక. ఆ భాగ్యము తమకు వ్రాయకపోయినా ఇతరుల బిడ్డలనైన పెంచి సంతోషింతామని - అట్టిదంపతులు దత్తపుత్రకోకం కొనితెచ్చుకొంటున్నారు. ఆ బిడ్డ, తనభర్తవల్ల అన్యథా యైన కలిగినదైతే చాలునని స్త్రీకి అనిపించకపోదు. అలాంటప్పుడు ఆమె అనుమతితో రెండవవివాహము చేసుకోవడానికి అవకాశం ఉండాలని మాజీమంత్రి భాష్యంయున్నగువారున్నూ వాదించారు. అందుకు ఈ బిల్లులో అవకాశంచూపకపోవడం లోపమేనని - పలువురు తలుస్తున్నారు. ఇక విడాకుల కనుమతి విషయంలో మా అభిప్రాయము ఎల్లరికి ఇదివరకే స్పష్టము. అట్టిఅనుమతి స్త్రీలకు బహుసకృత్తుగా అవసర మగుచున్నది. అయితే ఇంకను మనసాంఘికవ్యవస్థ దానిని చట్టరూపమున బడయుటకు తగినస్థితికోనికి రాలేదేమోనని మాజంకు. అట్లని దాని విషయమై స్త్రీ పురుషులుయోచింపనే రాదని మేమనము. అందుచేతనే, చిరకాలము క్రిందటనే, దాదాపు 20 సం|| ల క్రిందటనే, మేము ఈ విషయమై విద్యా వంతురాండ్రు అనుకూలముగాను ప్రతికూలముగాను వ్రాసిన వ్యాసములను ప్రకటించియున్నాము. అయితే స్వాతంత్ర్యము సిద్ధించిన క్రొత్తపాంగులో, పురుషు లధికసంఖ్యాకులుగా గల శాసనసభ ఈబిల్లును చర్చించి సమ్మతించినది. కావున అచిరకాలములోనిది చట్టమగును. విడాకులు కోరుటకు

కారణములైన వానిలో-భార్యాభర్తలలో నెవరైన యాదృచ్ఛికముగ నొనర్చు 'వ్యభిచారము' రెండవ వారిచే క్షమింపబడదేని-అనునదికూడ చేర్చక శాసనసభవారు నిరాకరించుట హర్షింపదగినది. దానివల్ల ఎన్నో అనర్థము లేర్పడియుండును. మరి విడాకుల పిటిషన్‌కు స్టాంపు ఫీజు రు 50/లు గాక రు 10/లు గావించుటయు సంతోషదాయకము. మాధవమీనన్ గారు తెల్పినట్లు మలబారులోవలె రు 0-12-0 లే చేసియుండవలసినది. అంతకు పాల్పడిన తర్వాత ధనము లోపమవుతుందా? అత్యవసరముకల్గిన మానవతికి లేమి ఆటంకం కాదా? మొత్తమున కీ విడాకులచట్టము కేంద్రమునకు విడిచియుండవలసినది. అట్లుగాక జరిగి పోయినదిగావున మేమును - శ్రీ అనీరుద్దీన్ బీగం గారితోపాటు "ఈ స్వాతంత్ర్యం సంపాదించిన హిందూ యువతులు, తమకు సంప్రాప్తించిన ఈ క్రొత్తహక్కును దుర్వినియోగ మొనర్పకుందురు గాక" యనియే కోరుదుము.

## పాతగవర్నర్ దంపతులకు వీడ్కోలు

ఈ నెల 7 వ తేదితో అధికారము చాలించుకొని వెళ్లిన కడపటి బ్రిటిష్ గవర్నర్ నైదంపతులకు హృదయపూర్వకమగు వీడ్కోలు నిచ్చుచున్నాము. వీరుభయులును రాష్ట్రమంతట పర్యటనమొనర్చిరి. ధనాఢ్యుల దివ్యభవనములనేగాక పేదల గుడిశలను సందర్శించినారు. గొప్పవారిచ్చిన విందులారగించుటే గాక, రహదారి ప్రక్కన పూరిగుడిశలో పేదరాలమ్మ ఇడ్లీ, చట్నీలకూడ రుచిచూచి రాష్ట్రవాసుల జీవితముయొక్క ఆంతర్యము గ్రహించినారు. చక్కగా అలంకరించిన దర్బారుహాలులో కొలువుదీరి పెద్దలకు దర్శనమిచ్చుటే గాక, పల్లెటూరి రైతుల వీధియరుగుపై వారితోగూడ ఆసీనులై వారి మంచిచెడ్డల నరసినారు. గవర్నరు సతియు భర్త నన్నివిధముల ననుసరించినది. ఈమెలో మరియొక్క విశేషము. సామాన్యముగ నిట్టియున్నతపదవు లలంకరించివచ్చిన వారి సతీమణులు-తాము వచ్చిన మరునాటినుండి భారతీయుల సాంఘిక వ్యవస్థ తమకా మూలాగ్రము తెలిసినట్లు, తాము వారిని సంస్కరించి బాగొనర్ప కంకణము దాల్చినట్లు మాట్లాడేవారు. ఈమె అట్లుగాక - తనకు మన పరిస్థితులు కేవలమపరిచితములనియు, తెలుసు కొనుటకే యత్నించుచున్నామనియు, మనతో చేరి మనబాగుకై యథాశక్తి సహాయమొనర్తుమనియు వినయముతో పల్కుచుండినది. మరల్నోపెదప తిరిగీ ఇట్టివారిని మనము బడసియుండలేదు. నైదంపతుల కాయురారోగ్యము లాసించుచున్నాను.

## బూచీ

బూచి బూచి యని భయపెడితే
బూడిద పాలగు బుద్ధంతా
అమ్మలు! అక్కలు! విన్నారా!

ఈ సత్యం మీ వీనులలో
స్పందించిన దివసము నుండీ
మెలకువతో మసలండీ!

— రావిపాటి వేంకటస్వామి




### నాగేలు

చిత్తూరునుండి వెలువడుచున్న తెలుగువారపత్రిక. రైతుకూలీప్రజా వారపత్రిక. "రైతుకూలి ప్రజా" అనకపోతే 'ప్రజా' అంటే చాలదా అని మాకు చిరకాలంనుండీ ఒక సందేహం. 'చిత్తూరు తెలుగుసీమే' అని "తెలుగు సిపాయ్" అంటున్నాడు. చిత్తూరు, కుప్పం, పుత్తూరు, తిరుత్తణి మొదలైన తాలూకాలలో తమిళగ్రామాలు కేటాయించారనీ, 1931 జనాభాలోనే ఈ కేటాయింపుకనుగుణ్యంగా సరిహద్దు గీచారనీ, ఈసంగతి ప్రచారం చేయను చిత్తూరులోనే కొన్నిపత్రికలు వెలిశాయని అనుకుంటున్నారు. నాగేలు కవి ఎరుకయేనా? ఏడాదికి చందా రు 12-0-0 లు. వలయువారు పత్రికాలయం చిత్తూరు వ్రాయండి.

### యదుకుమార్

తెలుగు మాసపత్రిక. యాదవులలో 1000కి ఏ ఒకరిద్దరైనా చదివారో లేదో అని ఆ కులంవారిలో "విద్యావశ్యకత ప్రచారంచేసి బీదవిద్యార్థులకు ప్రత్యేక సౌకర్యాలు కలుగచేయవలసిందిగా ప్రభుత్వం మీద ఆందోళనగావిస్తుంది యదుకుమార్" అని ప్రథమసంచిక సంపాదకీయాభిప్రాయం. ఉద్దేశమూలం మంచిదే. అయితే ఈ కులపత్రికలు, కులాభిమానాలు ఏ పరిణామంచెందుతాయాఅని మా సందేహం—యాదవసంఘాన్ని ఉత్తేజపరచే వ్యాసాలతో పత్రిక నిండిఉన్నది. చెన్నపట్నప్రాంతాలలో 'అరవపిళ్లలు'గా చలామణి అవుతున్నవారినికూడా తెలుగుయాదవులని ఈ పత్రిక వెల్లడిచేయుచున్నది. విడి ప్రతి రు 0 4-0. సం॥ చందా—రు 3-0-0 పత్రికా కార్యాలయానికి గుడివాడ వ్రాయండి.

### అచల ఋషి వేమన

ఇది కె. హనుమారెడ్డిగారు సంపాదకులై ప్రచురించుచున్న వేదాంతమాసపత్రిక. దీనిపేరునుబట్టి ఇది వేమనయోగి ప్రబోధితమగు వేదాంతమును ప్రచారముచేయునది. సాలీనా చందా రు 4-0-0 వలయువారు పత్రికాధిపతి, ప్రొద్దుటూరు అని వ్రాయుడు.

### ప్రేమసమాజము (విశాఖపట్నము) అష్టమవార్షికోత్సవనివేదిక.

ఈ నివేదికయందు తెలుపబడినట్లు ఈ సమాజమువారు గత 8 సం॥లుగా గావించుచున్నకృషి ప్రశంసాపాత్రము. వీరు అనాధ శరణాలయము, అనాధబాలికల వసతిగృహము, రాత్రి పాఠశాలలు, వేసవి చలివేంద్ర, నిత్యసంతర్పణలుమున్నగునవి నిర్వహించుచున్నారు. ఆసుపత్రి రోగులు, కాందిశీకులుమున్నగువారికి సేవగావించుచున్నారు. అనాధప్రేతసంస్కారము, నిరుపేదల సంసారములకు సహాయము మున్నగువానిని

పల్పుచున్నారు. హరిజనప్రచారము, శాఖాహార ప్రచారము, అహింసాప్రచారము మున్నగు ప్రచారములు సాగించుచున్నారు. ముఖ్యముగా నీసంస్థకార్యనిర్వాహకులు, పలువురు తమ స్వకుటుంబ పోషణార్థమై యథోచితవృత్తు లవలంబించిన సామాన్యులగుట విశేషము. ఈ సంస్థ దినదినాభివృద్ధి చెందునని ఆశించుచున్నాము.

## శ్రీ త్రినాథ వ్రతకల్పము

గ్రంథకర్త : శ్రీ డా. పోలాకి శ్రీనివాసరావుగారు. ఇది అపూర్వవ్రతము. అన్ని వ్రతములవలెనే ఇదియు "వ్రతానాం ఉత్తమంవ్రతం". దీనికి కథ, మహాత్మ్యము, పూజవగైరాలిందు దహరింపబడినవి. ఈ వ్రతమున కవసరమైన కనీసపు ఖర్చు 0.0.9. అయితే నిర్ణయింపబడిన ముఖ్యసంభారములలో కానీ నూనే, కానీ వక్కలాకులు సేగాక కానీ గంజాయికూడ చేర్చుటవింత. మద్రాసు రాజధాని ప్రభుత్వమువారు సంపూర్ణ మద్యనిషేధ చట్టమును యావద్రాష్ట్రమున ప్రవేశపెట్టనుండగా త్రినాథులు- కానీ 'గంజాయి' కపేక్షింపసేలనో? అయినను ఏవ్రతమునైన దూషింపరాదు. అది భక్తుల చిత్తవృత్తి ననుసరించినది. దీనివెల రు 0-6-0 లు. వలయువారు సుందరరాం అండుకో, తెనాలి, అని వ్రాయండి.

## గుంటూరు పత్రిక

గుంటూరు పత్రిక స్వాతంత్ర్య జన్మదినసంచిక విమర్శనార్థమై మా కార్యాలయ మలంకరించినది పత్రికా సంపాదకులు శ్రీ జమిలి నమ్మాళ్వారుగారు చాలాసమర్థతతో దీనిని తయారు చేయించినారు. "గుంటూరిగొప్ప" చాటు పలువ్యాసము లిందున్నవి. అందు ముఖ్యముగా "మనజిల్లాలో ప్రాచీన రాజధానులు" అని శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు వ్రాసినది మిక్కిలి ఎన్నదగినది. వలయువారు గుంటూరునకు పత్రికా కార్యాలయమునకు వ్రాయుడు.

---

రాబోవు అక్టోబరు "గృహలక్ష్మి" సంచిక

## "దసరా సంచిక"

గా ప్రకటించుచున్నాము గావున రచయితలను ప్రత్యేక వ్యాసములు, కథలు, పద్యములు, పాటలు, నాటికలు మున్నగునవి వ్రాసి పంపకోరుచున్నాము. స్థలసంకోచము గమనించి త్వరగా పంపప్రార్థితులు.

సంపాదకుడు

## శ్రీ సర్వధారినామ సం॥ర భాద్రపద, ఆశ్వయుజ మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | గు | త్ర. 9-27 ధ 14-36 శు 1-7 షడశీతి పుణ్యకాలం. |
| | 17 | శు | చతు. 14-28 శత 21-2 పూర్ణిమాతిథి అనంతపద్మనాభచతుర్దశీ వ్రతం. |
| | 18 | శ | పౌ. ○ 19-35 పూభా 27-31 రా 23-40 శూన్యతిథిః ఉమామహేశ్వరవ్రతం [చంద్రదర్శనం. |
| | 19 | ఆ | బ. పాడ్యమి 24-27 ఉ భా 33-34 మహాలయ పక్షారంభం. |
| | 20 | సో | వి. 28-20 రే 38-41 చాతుర్మాస్యద్వితీయా అశూన్యశయనవ్రతం. |
| సెప్టెంబరు | 21 | మం | త. 31-12 అశ్వని 43-5 ధ 31-12 బృహద్గౌరీవ్రతం సంకష్టహరణ గణేశవ్రతం. |
| | 22 | బు | చ. 32-53 భ 46-1 భరణీమహాలయః. |
| | 23 | గు | పం. 33-21 కృ 47-49 హ 2-53. |
| | 24 | శు | ష. 32-40 రో 48 16 దేవీలలితావ్రతం. |
| | 25 | శ | స. 30-16 మృ 47 38 వ్యతీపాన్మహాలయః. |
| | 26 | ఆ | అ. 27-3 ఆర్ద్ర 46-0 సూర్యసావర్ణిక మన్వాదిః రుద్రమధ్యాష్టమా. |
| 1948-వ సం॥ | 27 | సో | న. 23.1 పున 43-27 వ 39-20 తిథిద్వయం నవమీసువాసినీ పూజా [మహాలక్ష్మీపూజా. |
| | 28 | మం | ద. 18-0 పుష్య 40-7 ఏకాదశీతిథిః |
| | 29 | బు | ఏ 12-52 ఆ 36-10 సర్వేషామిందిరైకాదశీ షశ్శీతిముఖం యతీనాం. మహాలయః |
| | 30 | గు | ద్వా. 6-59 మ 32-5 గజచ్ఛాయా కలియుగాదిః |
| | 1 | శు | త్ర. 1-4 ఉఫ॥ చతు 54-5 పూర్వమాస శివరాత్రిః. |
| | 2 | శ | అమా. ● 58-53 ఉఫ 23-4 మహాలయామాస్యాతర్పణం పిండపితృయజ్ఞం. |
| | | | **ఆశ్వయుజ మాసము** |
| | 3 | ఆ | శుద్ధపాడ్యమి. 43-20 హ 20-1 దౌహిత్రకృత మహాలయః దేవీశరన్నవరాత్రారంభం అఖండకలశ స్థాపనం. |
| | 4 | సో | వి. 38-41 చి 16-52 రా0-7 ఉత్తరశృంగ చంద్రోదయం. |
| అక్టోబరు | 5 | మం | త. 34-39 స్వా 14-5 వి 27-50 |
| | 6 | బు | చ. 31-27 వి 12-40 స్కందపూజాశక్తి గణేశవ్రతం. |
| | 7 | గు | పం. 29-32 అను 11-50 వి 26-3 ఉపాంగలలితావ్రతం. |
| | 8 | శు | ష. 28-23 జ్యే 12-31 సత్యాసరస్వతీ పూజా; దేవీత్రిరాత్రవ్రతం. |
| | 9 | శ | స. 29-3 మూ 13-7 వ 29-3 రా 10-8 సత్యపరాక్రమతీర్థపుణ్యదినం. |
| | 10 | ఆ | అ. 30-51 పూషా 16-50 దుర్గాష్టమీ. [వాహనాదిపూజా. |
| | 11 | సో | న. 31-47 ఉషా 21-0 రా 2 52 మహానవమీ సువాసినిపూజా ఆయుధ |
| | 12 | మం | ద. 37-34 శ్ర 26-1 రా 8-2 విజయదశమీ శమీపూజా |
| | 13 | బు | ఏ. 41-32 ధ 32-5 రా 22-51 సర్వేషాం పాశాంకుశైకాదశీ. |
| | 14 | గు | ద్వా 47-59 శ 38-31 రా 27-0 గోపద్మద్వాదశీ. |
| | 15 | శు | త్ర. 52-58 పూభా 41-7 వృ 20-3. |

Printed and Published by Dr S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd, 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.